P. 901—20-3-70—2,000

# ఉ [illegible] టకము

## [illegible] లణం

(రాయలసీమ)

కర్త:

వేదము వేంకటరాయశాస్త్రి ఎమ్., ఏ.



వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4 మల్లికేశ్వరగుడివద్ద, లింగిసెట్టివీథి,

జార్జిటౌను, మదరాసు.

 [రూ. ౧. 8

ఈరూపకమును

గురుపూజాప్రతీక

శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారి

కీర్తిమూర్తికి

సమర్పించితిని

"తమరూపమె ధ్యానంబగు

తమ పేరె జపంబు సర్వదా యింక మాకున్"

వే వేం.

# ఉపోద్ఘాతము.

శ్రీకృష్ణదేవరాయఁడు ఆంధ్రులకు నిరంతరస్మరణీయుఁడు; సంస్కృత వాఙ్మయమునకు ఉపయుక్తుఁడు ఎట్టివాఁడో ఆంధ్రవాఙ్మయమునకు అట్టి వాఁడు.

ఈరాజు సంతఃపురవృత్తాంతము పరంపరాగతముగా నిట్లు కలదు.

"ఒకానొకదినము రాయలు రాత్రి భోజనానంతరము పండితగోష్ఠిచే బహుళ నిశీథముదనుక నుండి యాస్థానము చాలించి శయ్యాగృహంబునకుం జనిరట. అచ్చో నాతని పట్టమహిషి యంతకుమున్న హంసతూలికాతల్పం బునం గూర్చుండి చెలులతో ముచ్చటలాడుచు భర్త్రాగమనంబు వీక్షించు చుండి నిశీథమయ్యెఁ గావున నాపె నిద్రాభరంబునకు నోర్వఁజాలక పరాకున వ్యత్యస్తముగ శయనించె. ఇట్లుండ నవంతరము వ్యత్యస్తశయానయైన నిజ మహిషిపాదనూపురరవం బాతనికిఁ గర్ణగోచరం బయ్యెను. తోడనె దిగ్గన లేచి మంచము నలుగెలంకులఁ బరికించి యచ్చోఁ బాదములుంచి నిద్రించు భార్యం గాంచి కారణమూహించుచుఁ గొంతవడికిఁ దెలిసి కోపించి...... కండ్లు కటకటం గొట్టి......యచ్చోటువాసి యింకొక భవనంబునకుం జని యచట శయనించెను......"

"ఇట్టి వృత్తాంతమునంతయుం నాపె యరణపుకనియగు ముక్కుతిమ్మనఁ (నందితిమ్మన) చూచాయగ గ్రహించి.........పారిజాతాపహరణం బను కథఁ గొని ప్రబంధము రచియింప నారంభించెను. అందు తొలియాశ్వాసమునకే తన యభిప్రాయము తేటపఱచి దానికిఁ దగు పద్యములు విరచించి...రాజు నకుఁ దెలియఁజేసెను..." అనంతరము ఆకావ్యమునందలి 'నను భవదీయ దాసుని', 'పాటలగంధి' 'జలజాతాసన' అను పద్యములను వినఁగనే రాయలు

లోపముగాని తన రాణింగలనెననియుం జెప్పుదురు. (చూ. గురుజాడ శ్రీరామ మూర్తిగారి కవిజీవితములు పుట 177-179.)

పైకథ నాధారముగా గ్రహించి కొందఱు నాటకములను రచించి యున్నారు. నేను రాయనిమీఁది పక్షపాతముచేతనేమి, తిమ్మనార్యుని మీఁది గౌరవముచేతనేమి, పైకథలోని చమత్కారమువలన నేమి ఆకృష్టుం డనై ఈచిన్నిరూపకమును రచించితిని. కాని నాకుం దోఁచిన మార్పులను గావించితిని.

పారిజాతాపహరణమును తిమ్మనార్యుడు రాయనికి నీతి నుపదేశించుటకు ఆయన యంతఃపుర చరిత్రమును వ్రాసినాఁడనుటచేత కవి రాయనికి సూటిగా తగులునటువంటి వృత్తములనే కావ్యమున చొప్పించియుండునని తలంచుట సముంజసము. ఆవిషయమునే స్పష్టీకరించుటకు వ్రాసినాఁడో యను నట్లు టీకయుం ధ్వనించుచున్నది.

యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
... ... ...
గోరి తొలుమేన తనకైన కొదువ లెల్ల
మాన్చుకొనవచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుఁడో యనఁగమించె
నరసవిభుకృష్ణరాయ భూనాయకుండు.

అనియు,

చక్రవర్తి మహాప్రశస్తి నాఁడును నేఁడు
వెలఁగి ధర్మక్రమ స్థితిఘటించె
... ... ...

నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జననమందెను వసుదేవ మనుజవిభుని
కృష్ణుఁడనుపేర నరసేంద్ర కృష్ణదేవ
రాయఁడనుపేర నాదినారాయణుండు.

అనుటచేతను ఒకవిధముగా శ్రీకృష్ణులవారిదైన ఈ పారిజాతాపహరణచరిత్ర రాయనిచరిత్రయే యను నభిప్రాయమును తెలుగునే రాయనికి బోధించుటకై దీనిని రచించినాఁడని ధ్వనించుచున్నది. ఈయంతఃపురవృత్తాంతము నిజముగు నేని ప్రథమాశ్వాసమంతయు రాయని యంతఃపురకథయే గావలయును.

ఇందులకు తగినట్లు నేను క్రిందివిధిని కల్పించితిని. తెనాలిరామలింగయ్య రాయలవారి యాస్థానిలోనుండి ఎల్లవారిని భ్రమింపఁజేయుచు 'వికటకవి' యని ప్రసిద్ధివహించియుండెను. దానిని ఆధారముగాఁగొని అతనికి రాయల యంతఃపురములలో రాయలుండునప్పుడు ప్రవేశించు చొరవయుండినట్లును రుక్మిణి శ్రీకృష్ణులు పాచికలాడుచుండిన సమయమున నారదులవారు దర్శన మిచ్చినట్లు రామలింగయ్య వేగవనియు, నారదుని పారిజాతమునకు బదులు వజ్రపుబిళ్లను ప్రవేశపెట్టి సంవిధానమల్లితిని. మిగిలినదంతయు పారిజాతాప హరణమే—మక్కికి మక్కి.

తిరుమలదేవి పట్టమహిషి; చిన్నమదేవి రెండవరాణి. రుక్మిణీసత్యభామలకును వీరిరువురకును సాదృశ్యమునచ్చుటకై కోపవృత్తమును రెండవరాణికి పెట్టితిని. నారదునివలన పారిజాతాపహరణమున జరిగిన కార్యమును ఇందు తెనాలి రామలింగయ్యచే చేయించితిని.

చిన్నమదేవి యంతఃపురచర్యలోను పారంపరిని కైకొనక మార్చితిని. కేవలము వ్యత్యస్తముగా నున్నందులకే రాయఁడు కోపగించెననుట రాయనికి ఉచితముగా గన్పట్టలేదు. పైగా శయనమున నున్న దేవేరిని అంతసేపు అయన చూడకయుండుట ఎట్లు? అందులకై ప్రార్థనమునకై అయను

కోపగించినదనియుఁ అందులకు రాయఁడు శాంతింపఁ గడంగఁగా ఎంతటికిని ఆయమ తనియక, తుదకు పాదతాడనముచే రాయని బహూకరించెననియు, అందులకు అశోకమువలె వికసింపక రాయలు ముకుళితహృదయుఁడై వెడలి పోయెననియుఁ గల్పించితిని.

రాయనికి కోపమువచ్చిన వెనుక రాణియే తిమ్మయార్యునికి నివేదించుట కన్న పెలికత్తె అనునిగావించుట యుక్తమని చేటిచేతనే తిమ్మనకు చెప్పించి పారిజాతరచనకు పురికొల్పినట్లు అల్లితిని. ఆవెనుక కవియొక్క రచనాప్రయత్నము. ఈలో రాయలు దిగ్విజయయాత్ర బయలుదేరుటయుఁ గూడ నేఁగు చుండిన తిమ్మన తనకు సందు దొరకినప్పుడెల్ల తన కావ్యమును వినిపించి రాయనిమనసు మెత్తఁబఱచినట్లును, ఈవిధముగా రాయఁడు సుముఖుఁడై దిగ్విజయానంతరము పారిజాత, మను చరిత్రములకు కృతిసంధి వేవేరి నూరార్చినట్లును అనంతరకథను నిబంధించితిని. రాయఁడేగిన క్షేత్రయాత్ర దిగ్విజయానంతరము దేవేరి ప్రార్థనపై జరిగినట్లును, అప్పుడే తిరుపతిలో రాయఁడు ఆముక్తమాల్యదను అంకితమొనర్చి విగ్రహములను చెక్కించినట్లును మార్చితిని. దీనినే చిన్నమదేవి విజయమని 'భారతి'లో ప్రకటించియుంటిని. ఇందు కొన్ని నూతనస్థలకములను చేర్చికొంటిని.

వే. వేం.



# రాయలసీమ

---

## ప్రథమాంకము.

### స్థలము 1.

విజయనగరము - రాచనగరుచెంత నొక వీథి.

[నేపథ్యమున పంచమహావాద్యములు. కొందరు జనలు వడివడిగా నడచుచు ప్రవేశించుచుందురు.]

ఒక బ్రాహ్మణుడు.—[వెనుకకు తిరిగిచూచి] త్వరగా రావయ్యా, మాధవయ్యా సభ మొదలుపెట్టినట్లున్నారు. మనకు ఆలస్యమైనది.

[నేపథ్యమునుండి "జయీభవ; దిగ్విజయీభవ; ప్రబలరాజాధిరాజ, రాజప్రతాప, రాజపరమేశ్వర, అరిరాయభయంకర, మూరురాయరగండ, సప్తశార్దూలమర్దన, వీరనారాయణ, జగదేకవిభూష, జయ, కుమారవిక్రమ జయ; శ్రీకృష్ణదేవమహారాయ జయ; దిగ్విజయీభవ" అని బిరుదములు వినబడును. మంగళవాద్యములు మ్రోగును.]

మాధవయ్య—[ప్రవేశించి] ఉండవయ్యా రవంత. అబ్బ, నడవలేను. ఈశ్వరయ్యా, కొంచెం నెమ్మదిగా పోదాం.

ఈశ్వరయ్య—అయినట్టే, మనం పోయేటప్పటికి అంతా అయిపోతుంది. తెనాలిరామలింగయ్య సభకి పోయి చాలాసేపయింది.

మాధ—అది సరేగాని, ఏమిటయ్యా ఈనాటి విశేషాలు, జరగబోయ్యేది?

ఈశ్వ—ఓహో! ఏమనుకుంటున్నావు? ఈనాడు తెనాలిరామలింగయ్య ప్రమూంకరంనుండి రాజ్యానికి వచ్చాడు. ఆస్థానానికి వచ్చాడు ధూర్జటి గారిని గుంటించిన అపమృత్యు పూర్వ్యేస్తుడు. ఆ బయట పేళాల బండితుంతో

వాదం చేసి తరిమివేస్తాడు. పెద్దయ్యగారికి గండపెండేర బహూకరణం. ఇంకా చాలా విశేషాలు. భలే తమాషాగా ఉంటుంది. రా, రా. పోదాం.

మాధ—బలే! బలే! ఈదినం ఏమి స్వారస్యమైనా ఉంటుంది. సరే గాని, ఆ సమస్య ఏదో మరిచిపోయినాను, కొంచెం చెప్పవయ్యా.

ఈశ్వ—నాదస్తుడా, ఎంతలో మరిచిపోతివయ్యా! కృష్ణదేవరాయలవారి సమస్యలు ఈదేశంలో ఆబాలగోపాలం ఎరగనివాళ్లు లేరు. నువ్వేమో మరిచిపోయినానని అంటావు. చెప్తా విను.

"స్తుతమతియైన యాంధ్రకవి
ధూర్జటిపల్కుల కేల కల్గెనీ
యతులితమాధురీమహిమ?........"

[నేపథ్యమునుండి]

"హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవనితా
జనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసు
ధారసధారల గ్రోలుటంజుమీ."

ఈశ్వ—అదుగోనయ్యా తెనాలిరామలింగయ్య, సమస్య పూర్తిచేస్తున్నాడు. [నేపథ్యమున కరతాళధ్వనులు] సభ మొదలుపెట్టారోయి. పదపద.

[నిష్క్రమింతురు.]

---

స్థలకము 2

రాయలవారిసభ.

[రాయలు, అష్టదిగ్గజములు, మంత్రులు, పరివారము ప్రవేశింతురు.]

వంది—జయీభవ. [ఇత్యాది పఠించును.]

ఇరువురును—జయము, జయము, శ్రీకృష్ణదేవరాయమహారాయా, నీకు జయము. నీవు సత్యమున హరిశ్చంద్రుడవు, దానమున కర్ణుడవు, ఐశ్వర్యమున దేవేంద్రుడవు, రూపమున మన్మథుడవు, ఆంధ్రవాఙ్మయమునకు అపర భోజుడవు, పండితుడవు, కవివి, నిరంతరవిద్యావినోదివి. మేము పండితులము, కవీశ్వరులము. నీ ఆస్థానమందలి కవులను జయించుటకు వచ్చినాము. ఆశు కవిత్వధోరణిలో మమ్ము జయించినవారు లేరు. గడియకు వేయిపద్యములు నిరాఘాటముగా చెప్పగలము. ఎటువంటి క్లిష్టసమస్యయైనను పూర్తిచేయ గలము. అవధారణచక్రవర్తి, ధారణసార్వభౌమ, వాదిఘటాపంచానన, వాది మత్తేభసింహ, కవితార్కిక కేసరి మొదలైన బిరుదులు మాకు వందలు వందలు. మా ప్రశంసాపత్రములు వేనకువేలు. మా గండపెండేరములు మోయుటకు మత్తేభములు చాలవు. పోయినచోట్లనంతయు ఏనుగుల నెక్కినాము. నానా రాజసందర్శనములు చేసినాము. రాయలవారి ఆస్థానముమాత్రమే మాకు మిగిలియున్నందున వచ్చినాము. మీ పండితులను జయించి మాగజపతుల దేశమునకు పోదలంచినాము. మహాకవీశ్వరులారా! పండితప్రకాండులారా! విద్యావంతులారా! మీతో వాదమనగా మాకు తృణప్రాయము. ఊదివేయ గలము మిమ్మందరను—ఈ చిన్నసమస్యను పూర్తిచేసి విజయపు నిలుపుకొనుడు చూతము. [చేతు లాడించుచు రాగముగా]

"కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్."

రామలిం—[ఒకమారు లేచి మరల కూర్చుండును.]

వాదిపండి—ఏమీ, ఎవరును చెప్పలేరా? ఇంతేనా మీశక్తి?

అలసాని పెద్దన—అబ్బాయీ! రామలింగయ్యా, కానీ.

రామలిం—ఓహో! సభాస్తారులారా! వినుడు. ఓయి వాదీ!

గంజాయి త్రాగి తురకల
సంజాతులగూడి కల్లు చవిగొన్నావా!

లంజలకొడుకా? యొక్కడి
గుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్?

వాదికుంజి—[కోపముతో] మహాప్రభూ! ఇది కేవలము దౌర్జన్యముగాని వాదము గాదు. దూషించుటగాని పూరించుట గాదు. న్యాయము గాదు మహాప్రభూ.

రాయలు—రామలింగకవీశ్వరా! ఈ సమస్యను ఒకవేళ మేమే యిచ్చియుండినయెడల నేమి చేయుదువు?

రామలిం—మహాప్రభూ! ఏలినవారి యాశ్రితులముగదా. వినుడు మరి—

రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁ గొల్వఁ బాల్పడి రకటా
సంజయ విధి నేమందును
గుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్.

సభ్యులు—బళిబళి.

వాదికుంజి—ఎవరయ్యా నీవు, అధికప్రసంగిగా నున్నావు!

రామలిం—మహాహంకారగర్విత దుష్టవాది మదమత్తేభకంఠీరవ, నిరర్థక బిరుదాడంబరకవీంద్ర మేఘమహావాతూల, శుష్కవాదికుకవి ద్రావణమహానల గరుడ, వికటకవి, గండరగండ, గండభేరుండ, ఆశుకవిత్వ లాడలాడాయ మాన కవివృషభ ముక్కుత్రాడు ఇత్యాది బిరుదులుగొట్టి, శతఘంట, సహస్రఘంట, లక్షఘంట, కోటిఘంట, అర్బుదన్యర్బుదఘంటాదికవీంద్రుల గర్వమును భంజించి, వారి బిరుదులు, గండపెండేరములు, శాలువలు, దుప్పట్లు సహా పుచ్చుకొని రాయలవారి ఆస్థానమును ఆశ్రయించియున్న కవిమశకము తెనాలి రామలింగయ్య. ఈ కవిమశకమునకే భయపడుచున్నావు. కవిశార్దూలములు నీమీద లంఘించిన నేమైపోగలవు?

వాదిపండి—'శిశుస్త్వం మా ప్రలాప.' మహాప్రభూ! ఈపద్యమునకు చెప్పిన యర్థమును చెప్పక అన్నిపాదములు చక్కగా సమన్వయింపవలయును.

సీ. రాజనందనరాజరాజాత్మజులు సాటి
తలప నన్నయవేమధరణిపతికి.

[అటే మిగిలిన పాదములును]

గీ. భావభవభోగసత్కళాభావములను

[అటే మిగిలిన పాదములును]

రాయ—[సభికులవైపు చూచును.]

రామలిం—'పశుస్త్వం మా విలాప.' మహారాజా! ఇతడు పరమ దుర్మార్గుడు. ఏలినవారి యాస్థానమునకు వచ్చి వేమభూపతిని పొగడుచున్నాడు. మా యేలినవారు సర్వదక్షిణాపథచక్రవర్తి కానున్నారు. దండు బయలుదేరితే కృష్ణ కాదు, గోదావరి, మహానదివరకు పోగలరు. అప్పుడు మీ ప్రభువులందరు మా యగాప్రలగుదురు. నీపద్యమును నేను పూర్తిచేసినాను. ఈమారు ప్రశ్న నావంతు. నాపద్యానికి చెప్పవయ్యా వాదిఘటాపంచాననా.

సీ. మేకతోకకు మేకతోక మేకకు మేక
మేకతోకా మేకతోకమేక

[ఇట్లే తక్కిన మూడు చరణములును]

గీ. మేకతోకతోక మేక మేకతోకతోక.

[ఇట్లే తక్కిన మూడు]

వాదిపండి—[ఆలోచించుట నభినయించి] దీనికి అర్థము లేదన్నచో నవమానమగును. చెప్పుట కష్టముగా నున్నది, కాని. [ప్రకాశము] మహాప్రభూ, ఇది కట్టి అసందిగ్ధప్రలాపము. ఇటువంటి పద్యములకు కూడ మేము అర్థము కల్పించగలము. రేపు ఏలినవారి సన్నిధిలో రుజువుచేయగలము.

[సభ్యులు కొందరు నవ్వుదురు ; కొందరు దగ్గుదురు.]

రామలిం—తదికిణతోం. అయినదా మీకని! ఎట్లెక్కించినారయ్యా మిమ్ము ఏనుగులమీదను, లొట్టిపిట్టలమీదను!

ఒక సభ్యుడు—నిచ్చెనలువేసి ఎక్కించికుంటారు.

రామలిం—ఈ పద్యమునకు అర్థము చెప్పుము.

నరసింహాకృష్ణరాయుని
కరమరు దగు కీర్తి యొప్పెం గరిభిద్గిరిభిత్
కరికరిభిత్ గిరిగిరిభిత్
కరిభిత్ గిరిభిత్ తురంగకమనీయంబై

వాదిపండి—ఈపద్య మేగ్రంథములోనిది చెప్పగలరా?

రామలిం—తిలకాష్ఠమహిషబంధనములోనిది; నేనే వ్రాసితిని.

వాదిపండి—[ఆత్మగతము] ఈ మహానుభావు డసాధ్యుడుగా నున్నాడే. ఉపాయముగా నిచ్చటినుండి తప్పించుకొనిపోవలయును. [ప్రకాశము] అబ్బబ్బ! అబ్బ! కడుపునొప్పిగా నున్నది. మహాప్రభూ! మాకు నేడు సెలవు నిప్పించవలయును. రేపు మేము వచ్చి, శతావధానము, సహస్రావధానము కూడ చేయగలము. నేటికి సెలవు. [అని వడిగా నిష్క్ర]

రామలిం—శతసహస్రావధానముకూడ చేయగలరు! మహాప్రభూ! ఈ ఆశుకవులు మరల రారు

రాయలు—

ఉపమానం బస్తవకంబు సేతువు హిమ
వ్యూహంబునన్ జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా
విద్యాబలప్రౌఢి నీ
కొమరారెన్ సరసార్థబోధఘటనా
హేలాపరిష్కారతా

రద తీరూపము రామలింగకవిచం
ద్రా సాంద్రకీర్తీశ్వరా.

రామలిం—ఏలినవారి అనుగ్రహామే అంతయుం.

అప్పాజీ—మహాప్రభూ! కవిపండితులలో నందరకును పెద్దయైన పెద్దనగారికి నేడు గండపెండేరము బహూకరించవలెను.

రాయలు—అవును. చాల సంతోషము. [సేవకులు వరహాలపళ్ళెమును తెచ్చి సభామధ్యమున నుంతురు. వానితో గండపెండేరముకూడ.] పెద్దనార్యా! అందుకొనుడు.

అలసాని పెద్దన—మహారాజాధిరాజ!

శరసంధాన బల క్షమాది విభవ
శ్రేష్ఠంబులం గల్గు దు
ర్భరషండత్వబిలప్రవేశచలన
బ్రహ్మాఘ్నతల్ మానినన్
నరసింహక్షితిమండలేశ్వరుల నె
న్నన్వచ్చు నీసాటిగా
నరసింహక్షితిమండలేశ్వరుని కృ
ష్ణా రాజకంఠీరవా.

సభ్యులు—ఆహాహా! భళిభళి! బాగుబాగు!

రామలిం—[హహహా యని నవ్వి] మహాప్రభూ! ఈ పద్యము పనికి రాదు. తాతగారూ! ఏమి ఇట్లు చెప్పుచున్నారు? కంఠీరవమనగా సింహము కదా. సింహమునకు బిలప్రవేశమును లోపముగా పైగేటునచెప్పి రాజకంఠీరవా, రాజసింహమా యనుట దోషముకాదా. ఏలినవారు బిలము ప్రవేశించిన రాజకంఠీరవా యని తోకకట్టి వెక్కిస్తిరా యేమి? నేనుచెప్పెదను చూడుడు.

కలనం దావకఖడ్గఖండిత రిపు
క్ష్మాభర్త మార్తాండమం
డలభేదం బొనరించి యేగునెడ ద
న్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీటభూషితుని శ్రీ
నారాయణుం గాంచి లో
గలగం బారుచు నేగె నీవయనుశం
కం గృష్ణరాయాధిపా.

సభ్యులు—ఆః హా! దివ్యముగా నున్నది.

పెద్దన—మహాప్రభూ! ఈ గండపెండేరము, పారితోషికము రామలింగయకే తగినది.

రాయలు—రామలింగయగారూ, రండు.

రామలిం—ప్రభూ! పనికిరాదు. నేను పద్యము చెప్పుటకై చెప్పితిని గాని వేరుగాదు. తాతగారి పద్యము నిర్దోషము సంస్కృతశబ్దములు శ్రేష్ఠవాచకముగా ప్రయోగించినారు. బహుమతికి మాబోంట్లు కేవల మనర్హులుగదా. తాతగారూ, రండు. [అని స్వయముగా వారిని పిలుచుకొనివచ్చును. రాయలు గండపెండేరమును స్వయముగా పెద్దనగారికి తొడుగును.]

[నేపథ్యమునుండి—"జయం జయం ఏలినవారికి. పదునెనిమిది తిరుపతులనుండిన్ని, దక్షిణాందు దేవస్థానాలనుండిన్ని ఆయా ఆచార్యులు ప్రసాదములు తెచ్చియున్నారు. నానాదేశములు తిరిగి ఏలినవారి దర్శనానికి వేగులు వచ్చియున్నారు. అహమదానగరమునుండి వేగుల రామన్న, గోలకొండనుండి వేగుల గోపాలన్న, వాయువేగి హనుమంతయ్య, మనోవేగి పురుషోత్తమయ్య మొదలైనవారు వచ్చియున్నారు. ఇంకా ఏలినవారి దర్శనానికి రాజా జగదేవు, గని తిమ్మప్పనాయుడు, రాచూరి రామినాయుడు,

సేనాపతి పెమ్మసాని రామలింగమనాయుడు, హండే మల్లారావు, బోయి రామప్ప, కదురుపెనిమిది కప్పణాలవారు, దళనాయకులు, అప్పరపిళ్ల, కుప్పర పిళ్ల, సాళువనాయుడు, కొమార తిమ్మప్ప, సంగ్గరాజు, చెర్వప్రధాని తిప్పరసు, అయ్యప్పనాయడు, కటెం విశ్వనాథనాయడు, పెవ్వప్పనాయడు, అక్కప్ప నాయడు, కృష్ణప్పనాయుడు, వెలుగోటి యాచమనాయడు, కన్నడ బసవప్ప నాయడు, సాళువ మేకరాజు, మట్ల అనంతరాజు మొదలైనవారున్ను, కొప్పిరెడ్డి నాగారెడ్డి, బసువారెడ్డి మొదలైన రెడ్డికుమాళ్లున్ను, కమ్మనాయకులు విఠలప్పనాడు అల్లుళ్లు కొమాళ్లు రాచరికంవారు అమరనాయకంవారు అందరున్ను ఏలివారి దర్శనానికి కాచుకొనియున్నారు. క్రొత్తగా బుడుతకీసు వర్తకుడొకడుకూడ వచ్చియున్నాడు."

అప్పాజీ—మహాప్రభో! కవితాగోష్ఠి యైనది. ఏలినవారు కార్యాలోచనమందిరమునకు పోవలయును.

రామలిం—[తనలో] బుడతకీసువర్తకుడా! అందరికన్న ముందు వీని వినిచూచి అంతఃపురములో కొంతవేడుక చేసెదను.

[సభ లేచును. రాయలు, మంత్రియు నొకవైపును, మిగిలినవారు మరియొకవైపు నిష్క్ర].

---

# ద్వితీయాంకము

## స్థలకము 1.

### నగరిబయట.

తెనాలిరామ—[ప్రవేశించి] ఆహా. అద్భుతముగా నున్నది ఈ జడబిళ్ల. అంతయును నొకటే వజ్రము. పదికోట్ల వరహాలు చేయగలదు. అరచేతి యంత యున్నది. దీనిలో బంగారమును చెక్కి పెక్కు మణులవలె చూపినాడు. మంచి పనితనము. మాకొంట్లకేల! దేవేరులకే తగును. మరి దీనిని ఏలినవారికే చూపెదను. [వెనుకకు చూచి] ఓయి, ఆ ఖుసతీసు వర్తకుని మా వెంట రమ్మను. [ముందు చూచి] ఎవరురా అచ్చట! ఏలినవారు ఎక్కడ నున్నారు?

[నేపథ్యమునుండి—"తిరుమలదేవమ్మగారి నగరికి వెళ్లినారండి."]

రామలిం—మంచిది. నేనును తిరుమలదేవిగారి నగరికే పోయెదను.

[నిష్క్ర]

---

## స్థలకము 2.

### తిరుమలదేవినగరు.

[రాయలు, తిరుమలదేవి పాచికలాడుచు ప్రవేశింతురు. చెలికత్తెలు కొందఱు వారికి వీచోపులు వీచుచుందురు.]

తిరు—నాదే గెలుపు.

రాయ—నాదే గెలుపు.

తిరు—ఎట్లు ప్రభూ! తా మోడిపోయినారు.

రామలిం—[కటాలున ప్రవేశించి] ఇరువురును ఓడిపోయినారే.

రాయ—రామలింగయ్యగారూ, రండు రండు.

[తిరుమలదేవి లేచి నిలుచును. ఒక చేతి రామలింగయ్యకు ఆసన మిడును. విసరును]

రాయ—ఎట్లు కవిగారూ? ఇరువురును ఎట్లు ఓడిపోగలము?

రామలిం—ఏల కాదు? ప్రభువుల విజయములును, పరాజయములును వారి దేవేరులను చెందినవే గదా. కావున ఇరువురును ఓడినవారే.

తిరు—మరి తమ వాదము ప్రకారము ఇరువురమును గెలిచినట్లు కాదా?

రామలిం—అవును! కాకేమి. మీ కిరువురకును భేద మున్నదా. మండనమిశ్రుని శంకరాచార్యులవారు గెలిచినప్పుడు ఆయనభార్య తన్నుకూడ గెలిచిననే గాని గెలుపు పూర్తికాదని చెప్పలేదా? పరస్పరము మీ రొకరి నొకరు గెలిచిన నది గెలుపును గాదు, ఓడిపోవుటయును కాదు. కావున ఇరువురును గెలిచినట్లే, ఇరువురును ఓడినట్లే.

తిరు—కవులుగదా! నిరంకుశులు. మరి కవిగారూ, తాము నే డిచ్చటికి వచ్చుటనే మానగరు పావనమైనది. ఇటీవల వచ్చుటయే మానితిరిగదా.

రామలిం—అమ్మా, యాత్రగా దీక రాలేకపోయినాను. నేను కొంతకాలముగా గ్రామాంతరము పోయియుంటిని. పైగా వైదేశికులు కవులు వచ్చియుండిరి. లేనిచో మాకేమి, నిరంతరము ఏలినవారిని, దేవిగారిని వినోదింప చేయుటయేగదా పూనిక. మరి నే డొక విశేషము. ఖురాసాను వర్తకు డొకడు వచ్చియుండినాడు. వానికడ నీయదృశమైన వజ్రపు జరబిళ్లయుండినవి. చూచితిని. అట్టి యపూర్వవస్తువును ధరించుటకు దేవిగారుతక్క నితరు లెవ్వ రున్నారని తీసికొనివచ్చితిని. ఇదిగో చూడుడు. [అని చూపును.]

[రాయలవా రందుకొని దేవి కిత్తురు.]

తిరు—చక్కగా నున్నవి. ఇట్టి దొకటి వలయునని తలంచుచుంటిని. తలచని తలంపుగా వచ్చినది. రామలింగయ్యగారికి మనయందు దయయును ఆకారణ వాత్సల్యమును.

రామలిం—మహారాణిగారు తా మట్లు సెలవీయగూడదు. ఏలినవారు సాక్షాత్తు ఆ విష్ణువు నవతారము. 'నావిష్ణుః పృథివీపతిః'. సర్వదక్షిణానాథ

చక్రవర్తియొక్క పట్టమహిషియైన తాము సాక్షాత్తు ఆ మహాలక్ష్మియే. మీ యిరువురి కటాక్షమే మాకు సకలైశ్వర్యములకు కారణము. తా మిట్లు పలుక వచ్చునా ?

[తిరుమలదేవి ఆవిల్లును ధరింపబోగా చేటికలు వచ్చి దానిని చక్కగా సవరింతురు. దూరమునుండి చిన్నమదేవి చేటికలు ప్రభావతీకళావతులు చూచు చుందురు.]

ప్రభావతి--ఒసే కళావతీ చూచావటే ఈ తెనాలిరామలింగయ్యగారు! ఈమెగారు మహాలక్ష్మియట. మనదేవిగారిని తక్కువచేయడానికి ఈ ఎత్తు. ఈమె మహాలక్ష్మి పతి ఈయన నారదమహాముని కాబోలు

కళావతి—ఎరగవటే ప్రభావతీ, రామలింగయ్య గడుసుదనం, టక్కరి మాటలు

రామలిం— దేవిగారు ధరించుటచేత ఈవజ్రపువిల్లుకు విలువ యేర్పడినది. మీభాగ్యము ఆపాలోచిక్కైన లేదు. ఈభరతఖండంలో ఇటువంటి ఆధరణము ఇంకొకటి లేదు. ఢిల్లీలో లేదుగదా పాశ్చాత్యదేశాలలో లేనే లేదు. పరదవరి ప్రతినము గల ఎక్కడివారును ఇక్కడికి వచ్చుటచేత సకలాభరణాలున్ను మన రాజ్యమునకే వచ్చుచున్నవి. మనము వదలినవి ఇతరులకు. ప్రపంచమునందలి మేలైనవస్తువులు భరతఖండములోను. అందులో మేలువస్తువులు విజయనగరములోను, అందులోను మేలు శ్రీతిరుమలదేవిగారి నగరిలోను ఉన్నవి. సకలరత్నములున్ను ఇక్కడికే రాగలవు. పరివారికి తాము బహిఃప్రాణము. తమకు గర్వాతిశయిగదా మిగిలిన యంతఃపురమంతయు. కడమ దేవేరులందరును తమకు కర్పూరివారే. చిన్నమదేవిగారుకూడ తమకు చిన్నదే.

ప్రభావతి—[రామలింగనితో] చూచావటే చూచావటే, ఈరామలింగయ్యను. చిన్నమ్మగారి లేమిచేశారే ఈయన్ను. ఆమె ఏందుకే పిలిపెట్టి చూడడం. నారదుడే జగడాలుపెట్టడంలో. రాణీ బాయి దేవికే చెప్తాం ఇతగాడి చేష్టలంతా.

కళావతి—రామలింగయ్యకు త్వరలోనే శాస్తి కాబోతుందిలే.

[అని నిష్క్రమి]

[నేపథ్యమున శంఖధ్వని]

ఒక చేటి—మహాప్రభూ! సన్నాహసమయమైనది.

రాయలు—[లేచి ఆత్మగతము] నేడు ఈ రామలింగయ్యగారు చిక్కు తెచ్చిపెట్టినారు చిన్నమదేవి చేటికలు చెప్పుటకు పోయినారు. కానీ, ఎట్లగునో చూతము.

చేటి—ఏలినవారు ఇటు ఇటు.

[అందరు నిష్క్రమి]

---

స్థలకము 3

చిన్నమదేవి నగరు.

[మంచముపై చిన్నమదేవి పరుండియుండఁగా చేటికలు చుట్టు నిలుచుండఁగా ఒకతె వీణను మీటుచుండును.]

చిన్నమ—ఒసే ఆపాట వద్దే, నాకేమో కష్టంగా ఉందే.

ముసలిచేటి—ఏమమ్మా, ఒకవిధంగా ఉన్నావు తల్లీ.

చిన్నమ—తెనాలి రామలింగయ్య వచ్చాడన్నది మొదలు మళ్లీ ఏమి తంటా తెచ్చిపెడతాడో అని భయంగా ఉన్నదే. [కటాలున లేచి కూర్చుండి] ఒసే, ఏలినవారు ఇప్పు డెక్కడున్నారో చూచిరా.

ము. చే—ఆస్థానంనుంచి లేచి [అని సగములో]

చిన్నమ—లేచి!

ము. చే—లేచి తిరుమలమ్మగారి నగరికి వెళ్లిరి.

మరియొక చేటి—అక్కడికే తెనాలిరామలింగయ్యగారు కూడా వెళ్లారండి.

చిన్నమ్మ—[మంచముపైబడి] ఒసే, నాకేమో ఇవాళ ఒకమాదిరిగా ఉందే, అక్కడికి కెందుకు వెళ్లారే ఏలినవారు ఇక్కడికి రారు ?

ము. చే—ఊర్కే మొహమాటానికి పోయి యుంటారమ్మా.

చిన్నమ్మ—నాకేమో అనుమానంగా ఉందే.

ము. చే—పిచ్చితల్లీ! అనుమానా లెందుకమ్మా. ఏలినవారు మొహమాటానికి ఏవేవో చేస్తుంటారు.

ఒక చేటి—[వడిగా ప్రవేశించి] ఎవడో ఒక బుడతకీచువాడమ్మా, నగలవర్తకుడు ఏవేవో మంచి మంచి ఆభరణాలు తెచ్చాడమ్మా. తెనాలి రామలింగయ్య అసలు తిరుమలమ్మగారి నగర్లోకి పిలుచుకొనిపోయినారు.

చిన్న—[ముసలిచేటిని చూచి] చూచావటే, నా అనుమానం బలపడుతున్నది. నా కేదో అవమానం చేయడానికి ఎదో ఎత్తు వేస్తున్నాడే రామలింగయ్య.

[ప్రభావతీ కళావతులు ప్రవేశింతురు.]

ప్రభావతి—ఏమని చెప్పదమే దేవిగారికి ?

కళావతి—మరి చెప్పకపోతే ఎట్లాగే ?

చిన్న—ప్రభావతీ కళావతులూ, రండి. చెప్పండే అక్కడ ఏం జరిగిందో.

ప్రభావతి—ఏమీ లేదమ్మా. ఏలినవారు ఇందాక తిరుమలమ్మగారి నగరికి వచ్చారండి. అక్కడ ఏలినవారూ, దేవిగారూ పాచికలాడుతూఉంటే పరియాచకాలాడుతూ రామలింగయ్యగా రక్కడికి వచ్చారు.

చిన్న—ఏం చేశాడే ఆమహానుభావుడు. త్వరగా చెప్పి ముగించు.

ప్రభావతి—ఎవడో బుడతకీచువాడటమ్మా, వర్తకుడు. గొప్పగా వజ్రపువిల్లు తెచ్చాడు. తెనాలిరామలింగయ్యగారు పదికోట్లవరహాలకు బేరం చేశారట. ఏలినవారు తిరుమలమ్మగారి కిచ్చారు. ఎంత బాగుందమ్మా చీకటిని చీల్చేస్తుంది.

చిన్న—అర్ధాన్నంగా ఉంది. త్వరగా చెప్పి ముగించవే దాని సంగతి.

కళావతి—అంతటితో ఊర్కోకుండా తిరుమలమ్మగారిని చాలా దూరం పొగడి 'చిన్నాదేవిగారు మీకంటె చాలా చిన్న' అని ఇలాంటి మాటలు చాలా తక్కువపరుస్తూ మాట్లాడారమ్మ. మేము వినలేక వచ్చేశాము.

చిన్న—నాపాలిటి యముడే ఆ రామలింగయ్య. [అని ముసలి దాసిని కౌగలించుకొని కన్నీరు నించును.]

ము. చే.—ఏమమ్మా, ఏం మునిగిపోయిం దిప్పుడు. ఏదో ఒక రాగం ఆయన తెస్తే, అప్పుడక్కడున్నారు కాబట్టి ప్రభువారు ఆమెకిచ్చారు. అంతమాత్ర మేగదమ్మా. నీవు కోరితే అలాంటివి వందలు రావా?

చిన్న—వందలు గిందలు. నామాట ఎందుకెత్తవలెనే ఆ రామలింగయ్య. అతని నోటి కడ్డము లేదే. ప్రభువారుకూడా నిలుపలేరుగదవే. నన్ను ఈవిధంగా అవమానం చేయడానికి నేనేం అపకారం చేశానే ఇతనికి! ప్రభువారుకూడా ఆమోదిస్తే ఎందుకే ఈ బ్రతుకు? [అని ఆభరణములు మొదలైనవి తీసి మంచముపై విసిరికొట్టి తటాలున నిష్క్రమించును.]

ము. చే.—దేవిగారికి కోపము వచ్చెను. బహుశః ప్రభువారు ఇక్కడికి వచ్చినా రావచ్చు. ఓసే మీరంతా పనిపాటలు నిలిపివేసి ఎక్కడివారక్కడ చప్పుడు చేయకుండా ఉండండి.

[నేపథ్యమునుండి 'ప్రభువారు ఇటు ఇటు.' అంత రాయలవారు ప్రవేశింతురు.] [చేటికలు నిష్క్ర.]

రాయ—ఏమాశ్చర్యము, ఈనాగ కేమి ఇట్లు చిన్నబోయి యున్నది! ఆ చేటికలు సర్వమును చెప్పినట్లున్నది. [అని ఇటునటు చూచుచు నిష్క్ర.]

## స్థలకము 4.

### కోపగృహము.

[ఒక చేటి విసరుచుండఁగా, ఒక చేటి పాదము లొత్తుచుండ, కొందఱు నిలిచియుండ, తెల్లచీర ధరించి ఆభరణములు మాని మంచముపై పొరలాడుచు చిన్నమదేవి ప్రవేశించును.].

చిన్న—[కటాలున లేచికూర్చుండి] అయ్యో, నేనేం చేశానే ఈ ఆరాటం తీరేదానికి ?

కలలోననైన నవ్వులకైన నామాట
జవదాఁటవెఱచు నోచంద్రవదన,
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
ఎవ్వారి కొసఁగఁ డోయిగురుఁబోఁడి,
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నోచంచలాక్షి
తోడిచేడియలు నాతోడి వంతులకు రా
సైరింపఁజాలఁ డోసన్నుతాంగి ;
అరమరలు లేని కూరిమి ననఁగిపెనఁగి
కొదలుదీఱని గోర్కుల గూడియాడి
కపటమెఱుఁగని మమతలఁ గలసిమెలసి
యున్న విభుఁ డిట్లు సేయునే యోలతాంగి.

ఒక చేటి—అమ్మా, పిలిచినవారు వస్తున్నారు.

చిన్న—ఓసీ, నాదుస్థితి లేశే, [అని ముసుగిడుకొని పరుండును.]

[రాయలు నెమ్మదిగా ప్రవేశించుచు. ఒకతెను చూచి నోటిపై వ్రేలు పెట్టి మిగిలినవారిని చప్పుడుచేయవలదని చేసన్నలచే సూచించి చిన్నను దేవిని సమీపించును. దేవికి వీచుచుండిన దాగి చేతినుండి విసనకఱ్ఱను తీసి తాని దేవికి వీచును. చిన్నను కటాలున ముసుగు తీసి రాయలను చూచి మరల ముసుగిడుకొనును.]

రాయ—ఏమి యీకోపమునకు కారణము? నిజముగానే నీకు కోపము వచ్చెనదా, లేక నన్ను పరిహాసము చేయుచున్నావా? నీ కెవరైన నపకార మొనర్చిరా? నా కేమియు తెలియకున్నది.

ఇందునిభాస్య, మైతొడవు
లేలధరింపవు? సున్నఁగావు లీ
వెందును మానలేవు, తెలు
పేటికిఁగట్టితి? వీటికాయుచు
ల్కొందలిరాకు మోవిఁదుల
కింపఁగఁజేయక యున్కియేమి? నీ
చందము నింతయయ్యెడు ని
జంబుగ నాకెఱుంగఁ జెప్పుమా.

ఏమీ! ఇటు చూడవా!

మనముల మాటలం గ్రియల
మన్నన లీనొకనాడు నెట్టికా
మినులను, గారవంబు మెర
మెచ్చులకై పచరింతుగాని పా
యని యనురక్తి నీయెడన
యగ్గలమై కనుపట్టు నాకు నీ

పనిచిన పంపు సేయుటయ
ప్రాభవమా టది నీవెఱుంగవే.

[అని చిన్నమదేవిని తాఁకఁజూచును.]

చిన్నమ—[లేచి పయ్యెద సర్దుకొని] ప్రభూ! నన్ను తాకవలదు. చాలును, చాలును. చిన్నకు అందరకన్నను చిన్న. రామలింగయ్యాకే చుల కనై పోయినాను ప్రభువుల కేమిలెక్క నన్నింకనూ చిన్నబుచ్చవద్దు.

రాయ—ఏమీ, రామలింగయ్యగా రేమిచేసినారు?

చిన్న—చేయవలసిన పనియే చేసినారు. ఏలినవారు సాక్షాత్తు విష్ణువు, ఆమెగారు మహాలక్ష్మి. జడబిళ్ల మహాలక్ష్మికే తగును మహాప్రభూ! ఈచిన్న దానికేల?

రాయ—ఏమీ, ఇంతవంతకా అలిగెదవు?

చిన్న—లేదు మహాప్రభూ లేదు. తిరుమలదేవి అలిగిన లాభమున్నది గాని మావంటివారు అలిగి మాత్ర మేమి? ఏగుట్టయో, ఏబావియో చాలును. [అని దిరదిర నిష్క్రమించును.]

రాయ—[ఆత్మ] దీని కోపము మిక్కుటముగా నున్నదే. చూచెద గాక. [అని వెనుకనే నిష్క్రమించును.]

[చేటికలు ఒకరినొకరు చూచుకొనుచు నేపథ్యమువైపు చూతురు.]

నేపథ్యమునుండి చిన్నమ.

పతి ప్రాణసన్నిహితబంధువు,
పతి దైవం, బేదుగడయును పతి సతులకు, న
ప్పతియె కడు మేఁదప్పిన
గతి కులకాంతలకు వేఱు కలదే చెపుమా.

కలకాల మొక్కగతి పూ
సలలో దారంబుమాడ్కి సతి మదిలోనన్
మెలఁగెడు పురుషులు గలుగుట
తొలుజన్మను నోముఫలము తోయజనేత్రా

మ. చే.—అమ్మగారు ఏలినవారిమీద చాలాకోపం చేస్తున్నారు. పాపం ఏలినవారు చాలా వేడుకొంటున్నారు.

[మరల నేపథ్యమునుండి.

ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నొవ్వంగవచ్చు మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటి మాటలు చెపుమా.]

మ. చే.—చూడవే, చూడవే. పాపం ఏలినవారు అమ్మగారికి దండం పెడుతున్నారు. అయ్యొయ్యో! అమ్మగారు ఏలినవారిని తన్నివేసింది. ఎంత పని! ఎంతపని! ఏలినవారికి చాలాకోపం వస్తున్నది.

[రాయలు నేపథ్యమునుండి. 'బుద్ధిహీనురాలా! ఎంతసేపటికిని కోపము మానవా? ఓ! నీ ముఖము చూడరాదు. నా పాదాల్లో నీవు పడేదాకా నీ ముఖము చూడను. ఏమి దీనుగము! ఏమి దీనుగము!' అనుచు ప్రవేశించి కోపాటోపమున నిష్క్రమించును.]

[చిన్నమదేవి ప్రవేశించును.]

మ. చేటి—ఎందుకమ్మా అంతకోపం చేశావు!

చిన్న—పోనే బుద్ధిలేందానా, నీవా నాకు బుద్ధులు చెప్పేదానివి! [అని రాయలవారు పోయినవైపు చూచి] ఓసీ, నిజంగానే ఏలినవారికి కోపం వచ్చినట్టుందే!

ము. చే—అదిగదమ్మా నేను చెప్పదమున్నా, అంతదూరం ఎందుకు పెట్టుకొన్నావు తల్లీ?

చిన్న—[ము. చే. తో] ఒసే, నువ్వుపోయి వారితో మంచి మాటలు చెప్పి పిలుచుకొనిరావే. [ముసలిది నిష్క్ర)]

చిన్నమ—అయ్యో! ఎలినవారు బదులుచెప్పకుండా పోతున్నారే? [అని రెండడుగులు ముందుపోయి] ముసలిదాన్ని కసరుతున్నారు. నేనైనా పోయి పిలుచుకొనివస్తాను.

[అని నిష్క్ర)మించును.]

చేటికలు—మనమూ పోదాంరండి. [నిష్క్ర)]

---

# తృతీయాంకము

---

## స్థలకము 1.

### రాయల యాస్థానము.

[రాయలు, అప్పాజీ, అయ్యామరసు, కొండమరసు, బాచమరుసు, మొదలైనవారు ప్రవేశింతురు.]

రాయలు—మహామంత్రులారా! ఈవరకు వీరనరసింహరాయలవారు రాజ్యపాలన గావించుచుండిరి. ఇప్పుడు ఆరాజ్యాంశములు, దుర్గములు, దేశములు, కోటకొత్తళములు, విస్తీర్ణస్థలములు, పుణ్యభూములు, సామంతనరదు రాజ్యములు మేము చూచిరావలెను. అప్పాజీ మీ యభిప్రాయమేమి?

అప్పాజీ—మహాప్రభూ! ఏలినవారి యభిప్రాయమే మాయభిప్రాయము. ఉచితమైనదే. పెద్దలు ఏలినరాజ్యములు తొక్కిచూడవలెను. రాజ్యములోగల ప్రజలు స్వామివారిని కనవలెను. శత్రురాజులకు సామంతులకును భయంకరముగా చతురంగబలములతో అష్టదిక్కులు తొక్కిచూచి కీర్తి వెలయించ జేయవలెను.

రాయ—చాలసంతోషము. మీవంటి నీతిపరులైన మంత్రులుండగా మాకేమి కొదువ. మరి మాకు తక్షణమే ఈక్రింది విషయములు తెలియవలెను. కర్నాటక సింహాసనమునకు ఎన్నిలక్షలరాజ్యములు? గిరిదుర్గ స్థలదుర్గ వనదుర్గ జలదుర్గములు ఎన్ని? ఏదుర్గాలకు నగరిలెక్కసాన ఎంతెంత ఉన్నది? రొక్కమునకును నవరత్నభూషణములకును స్థాపించిన విశేషములకును వీరు మణియగార్లమీద చెల్లు నిలువకును, నగరి కైజీతం, ఏనుగులు, గుఱ్ఱములు, పరిజనులు అన్నిటికిని వివరముగా లెక్కవ్రాయించి చదివింపుడు.

అప్పాజీ—తిమ్మయ్యా! [అని ద్వారముపైపు చూచును.

వాకిటికావలి తిమ్మయ్య—[ప్రవేశించి] ఏమియాజ్ఞ మహాప్రభూ!

అప్పాజీ—ఈక్షణమే చిన్నభండారం అల్లాళనాథుడుగారిని నేను చూడవలెను.

తిమ్మయ్య—చిత్తం మహాప్రభూ. [అని నిష్క్రమి.]

అంతట చిన్నభండారం అల్లాళనాథుడు ప్రవేశించును.

చి. అల్లా—జయం జయం ఏలినవారికి.

అప్పాజీ—అల్లాళనాథుడుగారూ! ఏలినవారికి నగరలెక్కలు విన్నపము చేయవలెను.

చి. అల్లా—ఈవరకు వీరనరసింహరాయలవారు లెక్కలు పరామర్శించి అడిగినవారు కారు. ఇప్పుడు స్వామివారు అడుగుచున్నారు గనుక లెక్కలు సేకరించి నాటకర్నాట అన్నిటిని విశదముగా విన్నపము చేయగలనని మనవి.

అప్పాజీ—ఏలినవారి అమరనాయకం ఏనుగులెన్ని, గుఱ్ఱాలెన్ని, కాల్బల మెంత?

చి. అల్లా—గుఱ్ఱాలు యిరువైనాలుగువేలు. ఏనుగు ఘట్టాలు నూట యిరువై, కాల్బలము రెండు లక్షలు. ఇంతలకు స్థితి నెల ఒకటింటికి నలభై లక్షలవంతున సంవత్సరానికి నాలుగుకోట్ల ఎనభైలక్షలకు అమరనాయకులకు సీమలు ఏలించున్నారు.

రాయ—మంచిది. అప్పాజీ, మీరు తృణమును మేరువుచేయగలరు, మేరువును తృణముగా మార్చగలరు. అఘటనఘటనాసామర్థ్యము తమకే గలదు. మాకొక తీవ్రభారము తమచేత నున్నది.

అప్పాజీ—ఏలినవారి ప్రతాపముచేతనేగదా మేము ఇంతవారమైనాము. స్వామివారు ఏమి ఆజ్ఞ చేయుదురో దానిని ఏలినవారి ప్రతాపముచేతనే చక్క చేయగలము.

రాయ—సామంతబలముకన్నను అధికమైన బలము సంతరించి శత్రువులను మట్టుపెట్టవలెనని మా యాశయము.

అప్పాజీ—బళి! బళి! ఏలినవారి చిత్తమునకు వచ్చునట్లు చేయగలము. ఎవరోయి అక్కడ?

కావలి తిమ్మన—[ప్రవేశించి] ఏమిదేవరవారియాజ్ఞ?

అప్పాజీ—వేగులవారిని రమ్మను,

కా. తిమ్మ—మహాప్రసాదము. [నిష్క్రమి]

వేగులు ప్రవేశింతురు—దండం దండం మహాప్రభో. మేము ఏలినవారి యాజ్ఞచేత విజయనగరమునుండి కదలి, బిజాపురం, అహమ్మదానగరం, శ్రీరంగపట్నం, చదరంగపట్నం, మధుర, రామేశ్వరం, ఉమ్మత్తూరు, శివసముద్రం, పెనుగొండ, గోలకొండ, గుత్తికొండ, మేల్నాడు, మొరసునాడు, ఘట్టంసీమ, అరవరాజ్యం, మలయాళం, కొల్లి, కొంకణ, కేరళం, విరాటపురం, వరాటదేశం, మగధదేశం, మత్స్యదేశం, విదర్భదేశం, కాంభోజనగరం, కాశ్మీరఖండం, ఢిల్లీనగరం ఇవి మొదలైన తావులకున్ను, తులువ, హైవ మొదలైన దక్షిణరాజ్యములకున్ను, చంద్రగిరి, గండికోట, కడప, నంద్యాల, కొల్లకొండ, రాచూరు, ముదగల్లు, ఆడికల్లు, మైసూరు మొదలైన స్థలములకున్ను పోయినాము. ఆయాదేశములలోనున్ను, ఆయాదిక్కుల నుండే దొరలు, ముస్సరికములు, వారినడకలు, వారివారి కలిమి బలములు, గ్రామాదులు, పట్టణములు, పండితపామరజనులు అనుకొనేమాటలు, కోటకొత్తళములందలి నడవడికలు, నానాటి వర్తమానములు తెలుసుకొని వచ్చియున్నాము. కాలం వేగం కలిగి బుద్ధి విచక్షణతో బహుభాషాంతరములు తెలిసి

బహురూపములుగా సంచరించి అంతరంగవార్తలరసి వచ్చియున్నాము. ఏలిన వారి యాజ్ఞకు ఎదురు చూచుచున్నాము

అప్పాజీ—మంచిది. ఇప్పుడు మీరు పొండు. మేము పిలిపించి నప్పుడు రండు. [వేగులు నిష్క్ర]

అప్పాజీ—తిమ్మరుయ్యా.

తా. తిమ్మయ్య [ప్రవేశించును.]

అప్పాజీ—మహాసేనాధిపతి పెమ్మసాని రామలింగమనాయుండుగారిని తోడ్కొనిరా. [తిమ్మ నిష్క్ర]

రాయలు—[ఆశ్చర్యముతో] అహాహా! మాకు ఆశ్చర్యముగా నున్నది. మహామంత్రులు మీరు మాకన్నముందే అన్ని ప్రయత్నములను చేసియున్నారు. అపూర్వులైన మనుష్యులు దొరికిన సకలము సంభవింపవచ్చును. నేడు గదా మాదొరతనమును రాజ్యము ఏర్పాటయినది.

[పెమ్మ—రామలిం. ప్రవేశించును.]

పె. రా—జయము జయము ఏలినవారికి. జయము జయము మహామంత్రిగారికి. ఎంతకాలమునకు మేము ఏలినవారిని కొలుచు నవకాశము వచ్చినది. ఇంతకాలము వృథాగా మీాయుప్పు దినుచుంటిమి.

అప్పాజీ—నాయుండుగారూ కూర్చుండుడు. ఏలినవారు దిగ్విజయము బయలుదేరదలచినారు. మీాసన్నాహ మెంతలోనున్నది.

పె. రా—మహాప్రభూ! మేము శాగరూపులమై నిరంతరము ఏలిన వారి సింహాసనమును కొలిచియున్నాము. అజ్ఞ కాగానే యేనూరు యేనుగులు, ఇరువదిరెండువేల గుఱ్ఱములు, లక్ష మనుష్యులు ఇంట్లు సిద్ధముగా నున్నవారు సముఖానకు రాగలరు. నిమిషమాత్రమున సైన్యమును యేలినవారి ఎదుటికి తెచ్చునట్లు పెట్టియున్నాము.

రాయ—బళి! బళి! అంతయు మేము కోరినట్లే యున్నది.

అగ్యామరసు—మహాప్రభూ! రాజులైనవారలు అనువైన పురుషరత్నముసు గుర్తిస్తే ఆయన నరరత్నములను చతురంగబలములనున్ను సంతరించ గలడు. అప్పాజీగారు సాధారణ నియోగిగా ఎంచరాదు. ఆయన అసాధారణ నియోగి. ఏలినవారు సెలవిచ్చినట్లు అఘటనఘటనాసామర్థ్యం వారికే కలదు.

శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః,
వక్తా శతసహస్రేషు దాతా భవతి వా న వా.

ఎవరో ఒకరు మహానుభావులుగా నుందురు గాని అందరికిని ఆగుణములు రావు మహాప్రభూ.

రాయలు—బళి బళి! వాస్తవము మహామంత్రులారా, మేము ఏకదేశాన ఉత్తరాపథ్యముమీద కార్యము చేయవలెను. విజయాపురము, గోల్కొండ, అహమదునగరములను జయించి రావలెను.

అప్పాజీ—ఏలినవారి ప్రతాపము నడిపించుచుండగా నిదెంతటి కార్యము.

రాయ—తక్షణమే దిగ్విజయప్రయత్నములు చేయవలెను.

అప్పాజీ—తిమ్మరస్యా, తక్షణమే మా జోస్యులవారిని రమ్మను.

జోస్యుడు ప్రవేశించును.

రాయ—నమస్కారములు శాస్త్రులవారూ.

జోస్యు—అభ్యుదయోస్తు. నీకు దిగ్విజయము గాక.

అప్పాజీ—శాస్త్రిగారూ, ఇటు కూర్చుండుడు. [జోస్యు-అప్పాజీ చెంత కూర్చుండును] ఏలినవారు దిగ్విజయయాత్ర బయలుదేరదలంచినారు. ప్రశ్న చెప్పుము. ప్రస్థానముహూర్తము నిర్ణయింపుడు.

జోస్యు—మహామంత్రులయాజ్ఞ. ఆహా! ఎంత సుదినము నేడు. నేడే బయలుదేరవలయును. ఏలినవారు నరపతి. అశ్వపతి గజపతి నరపతులతో

నరపతియే శ్రేష్ఠము. 'నరాణాం చ నరాధిప' అన్నారు. విష్ణుఅంశ. ఏలిన వారు అశ్వపతి రాజ్యమును గజపతుల రాజ్యమును, అంతయు జయించి, సింహాద్రివద్ద జయ స్తంభము వేయించి, మరలివచ్చునప్పుడు కల్యాణ వేంకటేశ్వరుల దర్శించి, నూటయెనిమిది దివ్యతిరుపతులను, డెబ్బదిరెండు దేవస్థానములను సేవించి, సేతువునకుపోయి రామనాథుల దర్శించి ధనుష్కోటిలో ఖడ్గము కడిగి ఈరాజ్యమును ఆంధ్ర కర్ణాటక సింహాసనమున ఇరువైనాలుగు ఏండ్లు ఎదురులేక ఏకచక్రముగా రాజ్యమేలగలరు.

సభ్యులు—బళి బళి. [నేపథ్యమున వాద్యములు.]

రాయ—ఏమిది భేరీవాద్యము.

అప్పాజీ—శుభ శకునము మహాప్రభు! అది ఏలినవారి దిగ్విజయ ప్రస్థానభేరి.

రాయ—ఏమీ, మేమే చెప్పనుంటిమి. మా భాషణమును శకునముగా గ్రహించితిరి. బళి ఇక మాకు జయకాలము. మా సభ చాలును.

వంది—జయాధిప, దిగ్విజయాధిప, ప్రబలరాజాధిరాజ రాజప్రతాప రాజపరమేశ్వర, అరిరాయభయంకర, కుమారవిక్రమ జయ కృష్ణదేవరాయ మహారాయ జయ. [అందరు నిష్క్ర.]

---

## స్థలకము 2.

## ప్రధాన వీథి.

మ. చేటి—[ప్రవేశించి] ఏలినవారు కోపంతో వెళ్ళిపోయి వారం రోజులైనది. ఇంకా కోపంగానే ఉన్నారు. ఎవరూ వారిదగ్గిరికి పోలేకుండా ఉన్నారు. పైగా గొప్పయుద్ధప్రయత్నం చేస్తున్నారు. దేవిగారి దుఃఖానికి మేరలేకుండా ఉన్నది. ఏమైనామార్గం కనుకవలసిందని ముక్కులిమ్మన్న

గారితో వెళ్లి మనవి చేసుకుంటాను. రామలింగయ్యను పూర్వం తన్ని కన్నురాల గొట్టినవారుగదా; ఇప్పుడున్ను ఏదైనా ఉపాయం చేయగలరు. వారిదగ్గిరికే వెళ్తాను.

[నేపథ్యమునుండి—'శృంగారప్రబంధమేదైనా తాము వ్రాయవలెనండి']

ము చే—[రెండడుగులునడిచి ఎదుటచూచి] వారుగో తిమ్మయ్యగారు. ఇప్పుడు భట్టుమూర్తితో ఏదో మాటలాడుతున్నారు, కవితాగోష్ఠి కాబోలు.

[అంత తెరయెత్తగానే తిన్నెలపై కూర్చున్నవారుగా ముక్కుతిమ్మనయు భట్టుమూర్తియు ప్రవేశింతురు.

భట్టు—శృంగారప్రబంధ మేదైనా తాము వ్రాయవలెనండి. ఎంత కాలం యీలాగ గ్రంథరచన చేయకుండా ఉంటారు?

తిమ్మ—అబ్బాయీ! కావ్యరచన యనగా సామాన్యమా? చిరకాలముగా కావ్యరచనా సంకల్పము నాకు ఉన్నదిగాని అవకాశముకొరకు ఎదురు చూచుచున్నాను.

భట్టు—అవకాశము మనం కల్పించుకోవలెగాని తానుగా ఎట్లా వస్తుందండీ?

తిమ్మ—నిజమే. ఏకథను వ్రాయవచ్చును?

భట్టు—ఏదైనా పారిజాతకథ ఒకటి. మన పెద్దయ్యగారి మనుచరిత్ర చాలవరకై పోవచ్చినది.

తిమ్మ—ఎవరిచేవ వారిది.

ము. చే—[సమీపించి] స్వామీ దండములు. మహారాణిగారు చిన్నమ్మదేవిగారు తమతో విన్నవించమన్నారు.

తిమ్మ—[లేచి] ఏమాజ్ఞాపిస్తున్నారే చిన్నమ్మగారు.

మ. చే.—తామిటు రావలెను.

[అని ఇరువురును నిష్క్రమించి మరల ప్రవేశింతురు.]

తిమ్మ—[ఆత్మగతము] అహా! హా! ప్రణయకలహము. శ్రుతిమించి రాగమునం బడినది. చక్రవర్తికి బోధించుట సాధ్యమా? దావానలము ఉద్ధరిణి నీటిచే నడంగునా? నావలన నీపని సాధ్యమా? మరి రాణిగారివద్దట తీరుట ఎట్లు? ఓరి రామలింగా, ఎంతపని చేసితివిరా! నాడు నాచే నొకతాపునకు ఒక కన్ను పోగొట్టుకొంటివి; నేడు రాణిగారిచే పలికినవానిచే తన్నించి ఏమి కానున్నావో. ఒక నిముసమైనను కుదురుగా నుండలేవుగదరా! పలినవారు కోపగించిన చెడిపోగలవు. కానీ సాధించెద. కవినిగదా. నాకసాధ్యమేమున్నది? నాకవనమహిమచేత చక్రవర్తిని అనుకూలనాయకునిఁ జేసెద. [ప్రకాశము] అమ్మా, దేవికి విన్నవించు-తిమ్మనగారు ఉపాయం చేస్తున్నారు. కొంతకాలము ఓపికపట్టవలయును-అని.

మ. చే.—తమ యాజ్ఞ. దేవిగారికి కొంత ఊరట కలిగిస్తాను.

[అని నిష్క్ర.]

తిమ్మ—[ఆలోచించి, శిష్యులతో] ఓయీ, కుదిరిపోయినది కథ; నేడే రచనకు ప్రారంభించెదను. వ్రాయబోవు మహాకావ్యము శ్రీకృష్ణభగవానుని దివ్యచరిత్రము. పారిజాతాపహరణము. [మరల నాలోచించి] అహా! ఎట్టి యద్భుతసంవిధానము. ఎట్టి మనోహరమగు వేషము! శ్రీకృష్ణదేవరాయలు, తిరుమలదేవి చిన్నాదేవులు శ్రీకృష్ణభగవానుడు, రుక్మిణీ సత్యభామలు.

భట్టు—బళి! బళి! బాగా కుదురుచున్నది.

తిమ్మ—తెనాలిరామలింగయ్య నారదమహాముని. వజ్రపుదిల్లె పారిజాతపుష్పము. రాజు పూర్వజన్మమున శ్రీకృష్ణుడు; ఈజన్మమున శ్రీకృష్ణదేవరాయడు. ఆ ఆ. ఉండు ఉండు. నన్ను ప్రశ్నలు వేయకు. వివరములు నీకు తర్వాత చెప్పెదను. అబ్బాయీ, వ్రాయుము పద్యము ఆశువుగా చెప్పుచున్నాను.

భట్టు—[వ్రాయుటకు నభినయించును]

తిమ్మ—

యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
　　సింహాసనస్థుఁడై పెన్నుమెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁజేసి
　　పరకామినీ సహోదరతఁ జూప
మఱి జరాసుతునకై మథురవిడించుటఁజేసి
　　పరదుర్గదుర్గము ల్బలిమిఁగొనఁగఁ
బారిజాతమునాసపడి పట్టి తెచ్చుట
　　నౌదార్యమున దాని నడుగువఱుపఁ
గోరి తొలుమేనఁదనకైన కొదువలెల్ల
మాన్పుకొన వచ్చి భువనైక మాన్యలీల
నవతరించినకృష్ణుఁడో ననఁగమించె
నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు

భట్టు—ఆహా! హా! నేను బ్రదుకుతూ ఉండినంతకాలం తమకు ఉత్సాహం కలుగలేదు. భగవంతుని కృపచేత ఇప్పుడు కలిగినది. ఆంధ్రవాఙ్మయానికి అమూల్యాలంకారమైన గ్రంథరాజం పుట్టబోతూవున్నది.

తిమ్మ—అవకాశం రావలెనోయి, అవకాశం రావలెను. పెద్దయ్యగారు అనలేదా 'ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే! అని. ఇప్పుడు కుదిరిపోయినది. [ఉత్సాహముతో] వినినవారి హృదయమునకు ఎక్కునట్లుగా రచియించెదను. మామూలుమాటలే ప్రయోగించెదను. అంతఃపురమునకు సైత మర్థము కావలయును. వారికిని రాణిగారికిని సాక్షాత్తుగా జరిగిన సంభాషణలే

పద్యములుగా గూర్చెద. నేటిపరిస్థితులవలెనే చిత్రించెదను. శృంగారము పరమావధిందాకను గాక. ప్రబంధము విని తత్క్షణమే ప్రభువునకు పునస్సమాగమకాంక్ష యుదయించును గాక. ఇయ్యది తనచరిత్రమే యని ప్రభువునకు తోచును గాక.

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతర క్షతయే,
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితత యోపదేశయుజే."

అట్లుగదా ప్రభువుల నుపదేశింపవలయును.

భట్టు—ప్రాయశో నా మహాకావ్యమునకు ప్రస్తావనయైనది.

[అంకట చెట్టివాడు డప్పువాయించుచు ప్రవేశించును.]

[గురు శిష్యులు వింటారు]

చెట్టి—ఈ వేళ ఏలినవారు శ్రీకృష్ణదేవరాయలవారు ఈ భూలోకమంతా జయించడానికి మహాసన్నాహంతో బయలుదేరి పోతా ఉన్నారు. ఊరిబయట వెలిగుడారం చేసినారు. హార్యం కదిలి పోతున్నారు. [నేపథ్యమున భేరీవాద్యములు] రాయలవారు దళమెత్తేటప్పుడు బోయదొరల నందరిని పిలిచి నగరదిక్కు బెట్టించినారు. కార్యముఖానకు తురకాణ్యం సీమలోను ముసుకలుగాపోయి దిగి మూడేసి ఆమడదూరం, సాగరాలంటోయి, మనుష్యులను, పసులం ప్రాయం, గొల్లలు మేకలు, గుడాలువుందనుంతా కొల్లబెట్టవలసింది. సకల సన్నాహములతో బయలుదేరి దొరలు, మన్నీలు, రవుతులు, బిరుదాంగం పైకంవాళ్లు, ముందటివారు, వెనకటివారు, తుదంబక్కవారు, అందరున్ను వెలిగుడారానికివచ్చి వారివారి స్థానాలలో ఉండవలసింది. సైన్యంతో బయలుదేరేవాళ్లు బయలుదేరవలసింది. ఊళ్లో ఉండేవాళ్లు

హెచ్చరికగా ఉండవలసింది. దిక్కులు పిక్కటిల్లేటట్లుగా మూడవ ధమామి మోగించగానే ప్రయాణమై పోవలసింది.

[ధమ, ధమ, ధమ ధమ అని నిష్క్రమించును.]

చాటింపు వినుచుండినవారు—ఓరి నాయనోయి. భయంగా ఉందిరా నాకు. ఎంతదండు, ఎంతదండు. చూడు చూడు [అని నేపథ్యమువైపు చూతురు.]

[నేపథ్యమునుండి సిబ్బంది పాడుదురు.

కొండవీడుమనదేగా కోటిపల్లి మనదేరా
కాదనివెవ్వరువాదుకువచ్చిన కటకందాకా మనదేరా]

[ధమామి]

వినుచుండినవారు—జై, ఆంధ్రమాతకుజై, ఆంధ్రరాష్ట్రానికి జై.

[అని నిష్క్రమింతురు]

తిమ్మ—బళి! ప్రభువు దిగ్విజయయాత్ర బయలుదేరుచున్నాడు. నేనును నిరంతరము చింతచేయుండి కార్యము సాధించిన.

కుదిరె పథకమిప్పటికిన్
పదిలముగా రాజు కెలుకపడు రేపటికిన్
సదమదముగలదు పిమ్మట
మదికరుగదో యింకనైన మనప్రభువునకున్.

సంధ్యవేళ యతిక్రమించుచున్నది పోదమురావోయి తుంగభద్రకు.

[ఇరువురును నిష్క్రమింతురు ]

—

## స్థలకము 3.

### రాయల శిబిరము.

రాయలు ఇటునటు తిరుగుచు ప్రవేశించును.

రాయ.—[తనలో] భళీ, విజయమనగా మావేగదా. మా సైన్యములకు అడ్డులేదు. కృష్ణాగోదావరీప్రాంతభూములనంతయు జయించి ఆంధ్రభూముల నన్నిటిని ఒకరాష్ట్రముగా చేయనేని నేను కృష్ణరాయడను గాను. తెలుగు జనులెల్లరును తమ ప్రత్యేకతను గుర్తించునట్లు చేసెదను. శాతవాహనుల తర్వాత ఇన్ని శతాబ్దములకు నేనే సర్వాంధ్రచక్రవర్తిని కాగలను. నా తర్వాత నిట్టి చక్రవర్తి యుండజాలడని జోస్యులు చెప్పిరిగదా. ఆంధ్రజనులకు ప్రజాపాలనములోనే ప్రత్యేకరాష్ట్ర మేర్పడును గావలయు. మేము మార్గదర్శకులముగా నుందుముగాక [అని ఆలోచించుచు మీసలు వడివేయుచుండును.]

[వాకిటి కావలి తిమ్మన ప్రవేశించును.]

కా. తి.—జయం జయం ఏలినవారికి.

రాయ.—తిమ్మయ్యా, ఇదుగో ఇంద, ఈ శాలువ నీకై యుంచితిని.

కా. తి.—మహాప్రసాదము. [అని గ్రహించి] ఏలినవారి దర్శనానికి కవీశ్వరులు వచ్చియున్నారు.

రాయ.—తక్షణమే తోడ్కొనిరా.

అల్లసాని పెద్దన ప్రవేశించుచు—

'వాకిటి కావలి తిమ్మా

ముక్కు తిమ్మన ప్రవేశించుచు—

'ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా

మల్లన.—

'నీకిదె పద్యముగొమ్మా'

తెనాలిరామ.—

'నాకిచ్చెద మెచాలు నయముగనిమ్మా'

కా. లి.—[కటాలున పచ్చడము రామలింగమునకు కప్పి దండ మిడును.]

రామ.—అభ్యుదయోస్తు.

కవులు.—జయం జయం ఏలినవారికి.

రాయలు.—నమస్కారములు నమస్కారములు. రామలింగయగారూ ఆపచ్చడము చక్కగానున్నది.

రామలిం.—తనకావలె తిమ్మనమీద పద్యముచెప్పి గ్రహించితిని.

రాయ.—భళిభళి, ఎంతధార్మికుడు.

రామలిం.—ఏలినవారి అనుగ్రహామే మూలకారణము.

ఒకబంటు ప్రవేశించి—జయంజయం ఏలినవారికి, మనసేనాధిపతులు పెమ్మసాని రామలింగమనాయుడుగారు అహమదానగరంకోట ముట్టడి కొట్టించి అపట్టణం ఎంతమేరకో అంతమేరానున్న పెలిపాళ్యాలు ముట్టించి, అముదాలు తెల్లెట్లు దత్తించినారు. [అని నిష్క్ర.]]

రాయలు.—కవీశ్వరులారా! మాదిగ్విజయం వినితిరి!

తిమ్మ.—

నరసింహకృష్ణరాయా
దురమున నీపేరువిన దురకలద్రుంచో

కరిరాజవరదుఁడవ నీ
కరిఘటలును నిన్నుఁజూచి గ్రక్కునదిరిగెన్.

పెద్దన.—

గవనుల్ బల్లిదమయ్యె ఢిల్లికిని, వక్కాకోట మేటయ్యె నీ
భువనంబెల్ల నదల్చిపుచ్చెననఁగాఁ బోలేరు సందేరులన్ (?)
దవసంబెక్కె, బెకందకోట పురకాంతాగర్భనిర్భేదన
శ్రవణంబయ్యెఁ, భవత్ప్రతాపజయవార్తల్ కృష్ణరాయాధిపా.

తిమ్మ.—

ఉదయాద్రి వేగ యత్యుద్ధతిసాధించె,
వినుగొండమాట మాత్రనహరించెఁ,
గూటము ల్సెదరంగఁ గొండవీడగలించె,
బెల్లముకొండ యచ్చెల్లఁజేసెఁ,
దేవరకొండ యుద్వృత్తి భంగముసేసె,
జల్లిపల్లెసమగ్రశక్తిఁగూల్చెఁ,
గినుకమీఱు నసంతగిరిక్రిందుపడఁ జేసెఁ,
గంబంబుమెట్టు గ్రక్కునఁగదల్చెఁ,
బలనికాయము కాలిమట్టులనడంచుఁ
గటకమును నింకననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికినతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

రాయ.—బళిబళి.

[అప్పాజీ ప్రవేశించును.]

రాయ.—అప్పాజీ, మనము ఇప్పుడు గజపతుల రాజ్యముమీదికి నడువవలెను. మేము సంయుక్తాంధ్రరాష్ట్రము పరిపాలించవలెను.

అప్పాజీ.—[ఆలోచించి] స్వామివారు మామాటను మన్నింపవలెను. ముందర కదలిపోవుట కార్యముగాదు. మనము దేశమువదలి చాలదూరము వచ్చినాము. గజపతి సేనలవారు మనకు సామగ్రులు మొదలైనవి రానీయరు. ఏలినవారు ఈ ప్రయత్నమును మానుట మేలు.

రాయ.—[ఆత్మగతము] మహామంత్రి జంకుచున్నాడు. ఇంతవరకు మాసైన్యములు పరాజయము నెఱుగవు. మేమేల పోరాదు. ఇక్కట్టు వచ్చిన మహామంత్రి ఉపాయము చేయగలఁడు. ఇక్కట్టులోగదా మంత్రిని పరీక్షింపవలెను.

తిమ్మన.—అవును మహాప్రభూ, మహామంత్రులవారి ఆలోచన చక్కగా నున్నది.

రాయ.—కవిగారూ, కథకావ్య మెంతవరకైనది?

తిమ్మన.—ప్రథమాశ్వాసమైనది. కృష్ణమరాజు అమరావతికి తరలనున్నారు. తర్వాత పారిజాతాపహరణము, యుద్ధము, జయము.

రాయ.—ఆహా, మాకు శుభము. మేమును కృష్ణయొద్దుగ అమరావతిని దాటి కటకమునకు పోదలచితిమిగదా. దయచేసి ఒకటి రెండు పద్యములను వినిపింపుడు.

అప్పాజీ.—[తనలో] ప్రభువునకు మాహితోపదేశ మెక్కుట లేదు. యుద్ధప్రయత్నమే కనబడుచున్నది. నాకు చిక్కు తెచ్చి నన్ను పరీక్షింప జూచుచున్నాఁడు. కానీ చూచెద.

తిమ్మ.—మహాప్రసాదము. అవధరింపుము.

మానవతి యిట్లుమానని
మానక్రోధములచేఁ గుమారిలి చింతా
దీనగతినుండ మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుఁడనియెన్.

["ఇందునిభాస్య", "మనముల మాటలం గ్రియల" పఠింతురు.]

సభ్యులు.—బళి! బళి!

రాయ.—(తనలో) ఇది నామాటలే. ఇదంతయు నాచరిత్రమే.

తిమ్మ.—

పాటలగంధిచిత్తమునఁ బాటిలు కోపభరంబుదీర్ప నె
ప్పాటునుబాటుగామి మృదుపల్లవకోమల తత్పదద్వయీ
పాటలకాంతమౌళి మణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ దర్మిలి మ్రొక్కె మ్రొక్కెనన్.

రాయ.—ఆహా! హా! అనంతరము! అనంతరము! [ఆత్మగతము] ఇది సాక్షాత్తుగా నా చరిత్రమే.

తిమ్మన.—

జలజాతాసన వాసవాదిసుర పూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చోవామపాదంబునం
దొలగం ద్రోచె లతాంగి, యట్లయగునాథుల్నేరముల్సేయ నే
రలుకం జెందిన యట్టికాంత లుచితవ్యాపారముల్నేర్తురే!

రాయ.—ఆహా! హా! [తనలో] మహాకవి నాకు హితముపదేశించు చున్నాడు. వాస్తవమే. 'నాథులెన్నిరములెన్నియ చేరలుకం జెందినయట్టి కాంత లందఱ వ్యాపారములెన్నఁ డిట్టులే?' కాదే తిమ్మా. త్వరపడివచ్చితిని.

తిమ్మ.—[తనలో] ప్రభువు చింతించుచున్నాఁడు. నా కార్యము ఫలించినది.

రాయ.—తర్వాత వినిపింపుము కవిగారూ.

తిమ్మన.—

కోపనపదహతిగుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికె కూర్మి బయలుపడంగన్.

రాయ.—బళి! బళి!

తిమ్మన.—

ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తా
చినయది నాకుమన్ననయ; చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటక వితానము దాకిన నొచ్చునంచు నే
ననియెద, నల్కమానవుగదా యికనైన నరాళకుంతలా.

రాయ.—దివ్యముగా నున్నది! దివ్యముగా నున్నది! త్వరలో పూర్తి గావింపుడు. [తనలో] ఇదంతయు నాచరిత్రమే. ఇచ్చట కొంతమార్చి మహాకవి నాకు హితముపదేశించుచున్నాడు. అంతఃపురమునకు పోదునా. వలదు. గజపతిని జయించిగాని రాణివాసము ప్రవేశింపను. [ప్రకాశము] ఎవరురా అచ్చట! మా పినాకని తెమ్మనుము? రామలింగము నాయనింగారిని వేగము చూడ వలెను.

బంటు ప్రవేశించి.—జయం జయం మహాప్రభో, సేనాధిపతి రామలింగమనాయుడుగారు విజయాధ్వానంతో ఏలినవారి దర్శనానికి వస్తున్నారు.

[నేపథ్యమున విజయదుందుభి.]

రాయ.—ఆహా, మహావీరుడు. మేమును కార్యాలోచన మందిరమునకేగదము.

కా. లి.—ఏలినవారు ఇటు, ఇటు. [అని దారిచూపును.]

[అందరు నిష్క్రమింతురు.]

---

# చతుర్థాంకము

---

## స్థలకము 1.

### కటకము - గజపతి ఆస్థానము.

గజపతి, మంత్రులు మొదలైనవారు ప్రవేశింతురు.

వేగులు.—దండం దండం మార్యులినవారికి. కర్నాటకంవారు శ్రీ కృష్ణదేవరాయలవారి నాయకత్వాన దిగ్విజయయాత్ర బయలుదేరినారు. మొదట ఉమ్మత్తూరు శివసముద్రానకువచ్చి గంగారావును ఒక్కటని సాధించినారు. అక్కడ సోడిగాలవారిని ఉంచి అందుండి శ్రీరంగపట్నం జయించి విజయాపురంమీదికి నడిచినారు. రాయచూరు ముద్దగల్లు అద్దంకి మొదలైన స్థలాలలో శాణ్యములుఉంచి సినమొక్కటిగా నడిచినారు. ఆయాస్థలాల వారు వచ్చే దళాన్నిచూచి మునుకలంగానే పారిపోయినారు. సాధించిన స్థలాలలో శాణ్యములు ఉంచి గోలకొండవారి సరుదుస్థలాలమీదికి నడిచినారు. మ్లేచ్ఛులను వీగతోలి మనసీమలోనికివచ్చి గిరిదుర్గ జలదుర్గ స్థలదుర్గ వనదుర్గములు ఏండ్లకొలదివట్లు పోరాడినా సాధ్యంకాదు-అట్టివాటిని, దుర్గాలను కోటకొత్తళాలను దినమొక్కటిగా సాధిమార్గంచేత ఆక్రమించుకొని, కొన్నిన కోటలు ధూళికోటలుగా సాధించినారు. చితాపుఖానుని తెగలో ఇరువై మూడువేల స్తోమములున్ను నాలుగువేల గుఱ్ఱమున్ను ఒళశాపుగన్ను పడిసెను. అకటుమల్లో ముప్పయివేల స్తోమాన్నిఉంచి అవతల మనసీమాద్యంతం విహారం చేసుకపోయి పొట్నూరి సింహాద్రివద్ద పాళ్యం దిగియున్నారు.

మంత్రి.—మనగజపతుల సింహాసనానకు షోడశపాత్రులయొక్క భుజపరాక్రమంచేత నేటివరకు ఎట్టి హానియూ కలుగలేదు. ఈపరకు కర్నాటకమువారు మనసీమకు వచ్చినవారున్ను కారు.

గజపతి.—అవును. మనరాజ్యమునకును కర్ణాటకమువారికిని ఎట్టి వైరముగాని లేదు. మరి చెప్పుడు మాకన్నులారా, మీరింక నేమేమి విశేషములు చూచితిరి.

వేగులు.—ఇంతవరకు ఇంతేనండి. కర్ణాటకంవారి గుఱ్ఱపుదండు నేడో రేపో మనమీదికి రావచ్చును మహాప్రభో.

గజపతి.—సరి. మీరుపోయి ఇంక నేమైన విశేషములు చూచిరండు.

వేగులు.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమింతురు.]

మంత్రి.—మహారాజా, మన పెద్దగజపతివా రుండేటప్పుడు, వారు సేతుయాత్రకై కంచి, కాళహస్తి, అరుణాచలము, చిదంబరము, కుంభకోణము మార్గముగా సేతువుకు పోవునప్పుడు వెంటవచ్చిన రాణువవారు రాయలవారి సీమలోగల శివస్థలాలకును, కటాక అగ్రహారములకును హానిచేసి వచ్చియుందురు.

గజపతి.—వీరు బలవంతులై మనరాజ్యముమీదికి వచ్చినందులకు మనము వారితో యుద్ధముచేసి జయాపజయములు కనవలెను.

మంత్రి.—ఎవరోయి అక్కడ. తక్షణమే పదునాలుగురు పాత్రులను ఏలినవారు చూడవలెను.

ద్వారికుడు.—[ప్రవేశించి] ఏలినవారి దర్శనానికి స్వయంగానే బలభద్రపాత్రుడు, దుర్గాపాత్రుడు, భీమాపాత్రుడు, ముకుందపాత్రుడు, భీకరపాత్రుడు, భైరవపాత్రుడు, రణరంగపాత్రుడు, అఖండపాత్రుడు, మురారిపాత్రుడు, వజ్రముష్టిపాత్రుడు, తురగరేఖంపాత్రుడు, అశ్వపాత్రుడు, అభయపాత్రుడు, గజాంకుశపాత్రుడు, మృగేంద్రపాత్రుడు మొదలైన పదునాలుగురుపాత్రులున్నూ వచ్చియున్నారు

మంత్రి.—తక్షణము రమ్మను.

పాత్రులు ప్రవేశించి.—జయం జయం ఏలినవారికి.

గజపతి.—రండు, రండు మాదళవాయులారా, రండు; కూర్చుండుడు. మేము పిలిపించిన కార్యము చాలగొప్పది. మీకు ఇదివరకే తెలిసియుండ వచ్చును. కర్ణాటకులు కనుమలనుదాటి పోట్లూరి సింహాద్రి దగ్గర దిగియున్నారు. ఇక్కడికి నాలుగు క్రోశముల మేరలో నున్నారు. నేడు రేపులో మన మీదికి వారి గుఱ్ఱపుదండు రాగలదు. మనము మొదటి తాకాలోనె వారిని కొట్టవలయును. కులీ మాదళవాయులారా, పరంపరాగతముగా మనరాజ్యము మీ పెద్దలవలనను మీవలనను నేటివరకు ఎట్టి హానియులేక నిలిచియున్నది. మీపరాక్రమము అనంతమైనది. ఈసమయమున మీరు కర్ణాటకులను పారద్రోలి మనరాజ్యమును నిలుపవలెను.

పాత్రులు.—మహాప్రభో, మాకొలిచిన వేలుపా, ఏలినవారు మమ్మింతగా వేడుకొనవలసిన పనిలేదు. తరతరములుగా గజపతుల సింహాసనమును మేము కాచుకొనియున్నాము. ఏలినవారు ఏకమాత్రము జంకవలదు. మేముండగా ఈరాజ్యమును యమధర్మరాజు సయితము ముట్టలేడు. కాళహస్తి మొదలుకొని జగన్నాథపర్యంతం మనసీమ. ఎదురు ఎంచక, లోతు ఎరుగక, శత్రునృపులు లోజొచ్చివచ్చినారు. మంత్రాలోచనమీద వచ్చినపనిగాదు. కేవలము అహంకారముచేత వచ్చియున్నారు. కనుక వారికే ముప్పు, మనకార్యమే మెప్పు. వారు ఆగాయులు, మనము స్థాయులము. మన ప్రజలకందరికిని వారిని త్రోలవలెనని ఉత్సాహపుష్టికలదు. మరము పోరాడితిమా కర్ణాటకం వారు నిలువలేరు. రేపు ఉదయమే ఏలినవారు మాకందరికిని తాంబూల మిచ్చితే చాలును. తెల్లవారులోపల ఆయత్తపడి రాగలము. ఏలినవారు ఒక ప్రదేశాన రాజచిహ్నలతో, ఉన్నతస్థలమునుండి వేడుకచూస్తే చాలును. మేము పదార్గురము జగడమిచ్చి కర్ణాటకమువారిని పారద్రోలి వారి దొక్కున భాండాగారాలనున్ను, ఏనుగ గుఱ్ఱాలనున్ను, వెంటిదొరలనున్ను హస్తగతం చేసుకొని ఏలినవారి సముఖాన నుంచగలము. ఆపైవిషయము ఏలినవారికే విదితము.

భీకరపాత్రుడు.—మహాప్రభూ కృష్ణరాయదేమి దేవేంద్రుడా, అతని యేనుగులను పేటారు తునియలుగా ఖండించి క్షణములో విజయలక్ష్మిని గాంచగలము. దేవరవారి యాజ్ఞయే యాలస్యము.

వజ్రముష్టిపాత్రుడు.—చెఱకు నఱికినట్లు గుఱ్ఱములను ఖండించి వైచెదము. లేదా ఎల్లవారిని చెఱఁబట్టి ఏలినవారి పాదములకడ్డ తెచ్చివేసెదను. అయిరావతుదు వచ్చినను యుద్ధమునకు భయము లేదు.

ఆక్రంద పాత్రుడు.—కృష్ణరాయదనగా మాకెంత. యుద్ధము ప్రారంభమైనవెంటనే సైన్యమును చిందరవందరగాఁ ద్రొక్కి రాయనిఁ బట్టి బందీచేయగలము. ఏలినవారు వేడుకచూస్తే చాలును.

గజపతి.—[సంతోషముతో] దళవాయులారా. మీయనురాగమునకు మిక్కిలి సంతోషము. మీరు ఒక్కొక్కరే శత్రుసైన్యమును నాశము చేయగలరు. అందరును కలసిన చెప్పవలయునా. ఉత్సాహముతో వచ్చినట్లు శత్రువులు భయపడి పారిపోగలరు. మేము కేవలము నామమాత్రులము. ఈయైశ్వర్యమంతయు మీది.

పాత్రులు.—[లేచి] మహాప్రభూ, ఇక కదయుంజనను. అన్నిటికిని జగన్నాయకులు ఉన్నారు. రేపు ఉదయమే తామె సర్వము చూడగలరు. మేము ఆయత్తపడవలెను. ఏలినవారు సిద్ధముగా నుండవలెను.

గజ.—మరి ఇప్పటికి సభ చాలును.

పాత్రులు.—జయ వీరభద్ర బాహాబలేంద్ర మహారాయ జయ.

[అందరు నిష్క్రమింతురు]

---

## స్థలకము 2.

### రాయల స్కంధావారము.

రాయలు మారువేషమున నడచుచు ప్రవేశించును.

రాయ.—[చేతి నోటికష్టము చూచుచు] కార్యము చెడిపోయినది. నా కీర్తి నౌక ఎట్టి ఆటంకమును లేక ఇంతవరకు వచ్చినది. ఇంతకాలమునకు ఈగజపతి పర్వతమునకు తగిలి పగిలిపోవు సమయము వచ్చినది. ఆమహాను భావునిమాటను పాటించక శత్రుదేశము చొచ్చి ఇంతదూరము వచ్చినందుల ఫలమిది. కేవలము పరాక్రమము నతనే సర్వము సాధింపగలనని తలంచితిని. అంతయూ అప్పాజీ నీతిగాని వేరుకారు. షోడశపాత్రులు మహాపరాక్రమవంతులు. తెల్లవారుగాగల మాశిబిరముపై బడుటకు సన్నాహములు చేసియున్నారు. యుద్ధరంగమున మాసైన్యము తేరుకొనునో! మొదటిరాణా లోనే సమరమాయనున్నారు వారుచేసిన ప్రమాణములు చాలభయంకరము లుగా నున్నవి. పైగా వీరు మనవారు, దైవబ్రాహ్మణభక్తి గలవారు జగన్నాథోపాసకులు. ఇప్పుడేమి చేయవచ్చును. [ఆలోచించి] ఇప్పుడు అర్ధ రాత్రియైనది. ఇంకను చాల ప్రొద్దున్నది. ఈమారువేషముతో నేపోయి అప్పాజీని నిద్రలేపి ఆలోచించెద. ఇక్కట్టులలోగదా మంత్రిని పరీక్షింప వలయును.

[నేపథ్యమునుండి—"ఓహోయి నరసింహులూ విన్నావా ఈమాట"

రాయలు.—మాశిబిరముచెంత నెవరో మాటలాడుచున్నారు విందము గాక. [అని వినును.]

[మరల నేపథ్యమున.—నరసింహులూ విన్నావా ఈమాట. ఉదయ మైతే గజపతివారి దండు మనపాళెంమీద పడతావున్నారు. కర్నాటకం వారిబలం నిలుస్తుందో నిలవదో. మనలని తరమడానికి పాత్రులు ఘోర ప్రమాణాలు చేసినారంట. అప్పాజీమాటలు వినక రాయలవారు ఇంతదూరం

వచ్చినారు. అందుచేత అపాయం వచ్చింది. వచ్చిన పేరు ప్రతిష్ఠలు చెడిపోకవేమో. ఇప్పుడైనా అప్పాజీమాటలు వింటే అపాయం తప్పిపోను. ఆయన నిమిషమాత్రంలో పరాజయం విజయంగా వేయగలడు ]

రాయ — అవును! నాదే తప్పు. స్కంధావారమంతయు ఈవిధముగా గుసగుసలాడుచున్నారు దండుకు ధైర్యము తగ్గిపోయినది. ఇక అప్పాజీయే శరణము. [నిష్క్ర.]

---

ఫలకము 3.

అప్పాజీ గుడారము.

కా. తిమ్మన. — బాబుగారూ, ఏలినవారు మారువేషంతో ఇక్కడికే వస్తున్నారు.

అప్పాజీ. — [ప్రవేశించి] ప్రభువు ఈరాత్రివేళ ఈవేషముతో ఇక్కడికి వచ్చుట చూడగా కార్యము చెడినట్లు తోచుచున్నది. నాయుపాయమువలనే సర్వము చక్కబడవలయును. ప్రభువు తనదోషమును గ్రహించినాడు. పరవాలేదు. ఇంకను అవకాశముకలదు. నాప్రభువుకొఱకును దేశముకొఱకును నేనేమైనను చేయగలను.

[రాయలు ప్రవేశించును అప్పాజీ ఎదురేగి తెచ్చికూర్చుండ నియమించును.]

అప్పాజీ. — ఏలినవారు ఈరాత్రివేళ ఈవిధముగా పరివారములేక రావచ్చునా! శత్రువులకు తెలిసిన మోసముగాదా. తాము పిలిపించిన వచ్చుటకు మేము సంసిద్ధులముగా నుండగా తాము రానేల?

రాయ. — అప్పాజీ. పరవాలేదు ఈబాబుచెప్పిన సమకంతయు విశదము కాగలదు. [అని ఇచ్చును.]

అప్పాజీ.—మనస్థానాధిపతి కమలనాథయ్య వ్రాసినాడు. తెల్లవారు లోపల సుకశిబిరమును ధూళిధూళిగా ఎగురగొట్టుటకు పాత్రులు సంసిద్ధులై యున్నారు.

రాయ.—మరి ఇప్పుడేమి చేయవలెను.

అప్పాజీ.—స్వామివారికి నేను మొదటనే విన్నపము చేయలేదా. నావిన్నపము అప్పటిలో ఏలినవారి చిత్తమునకు రాలేదు. విచారించక ముప్పది ఆమడలు శత్రుభూమిలోనికి వచ్చినాము. రాజపతిసీమలో మొదటిస్థలములో దిగినందువల్ల వారు ఆలోచించుకొని తెగబడినారు.

రాయ.—అప్పాజీ, మరి వ్యవధి లేదు.

"ముట్టెడు కార్యము చక్కం
బెట్టెడు మంత్రియును పోరబెరగనిబంటుం
బుట్టుదుగా; దేవతలకు
బుట్టరె నానావిధైక భోగసహాయుల్."

అన్నదిది తామెరుగనిది కాదు. తమమాటవినని ఫలమిది, మహాప్రభూ! ఈ అపాయమునకు తగిన ఉపాయము తామే చేయవలెను. తమశక్తి సామర్థ్యములు బృహస్పతి శుక్రచాణక్యాదులకైనను లేదు. మావంటివారు తప్పుచేసిన మీవంటి మేధావులు చక్కదిద్దవలెను. క్షణములో పరాజయమును జయముగా మార్చుశక్తి తమకే గలదు.

అప్పాజీ.—[ఆలోచించి] సరి, భగవంతుని యనుగ్రహమే అన్నిటిని చక్కజేయగలదు. మరి స్వామివారి హృదయం ఏమిటి.

రాయ.—షోడశపాత్రులును ప్రాణములకు తెగించియున్నారు. ఈ సమయమున వ్యర్థప్రసంగములకు చూడరాదు. మహామంత్రులు తామేమి ఆజ్ఞ చేయుదురో దానిని బుద్ధిమార్గముగా నెంచి ఆప్రకారముగా నడచుకొనగలవారము.

అప్పాజీ.—సామదానభేదదండములలో దానభేదములును ప్రయోగింపవలెను.

రాయ.—సకలోపాయముల చేతను పరువు నిలిపిన చాలును. అంతయు తమచేతనున్నది. బొక్కసభండారములు, ఏనుగు గుఱ్ఱములు, రాజ్యరాష్ట్రములు, కోటకొత్తళములు, గ్రామభూములు, తుదకు మాశరీరముతో సర్వము తమ యధీనము. [అని దండమిడును]

అప్పాజీ.—అభ్యుదయోస్తు. ఇకను ఏలినవారు విశ్రాంతినందవచ్చును. సర్వము చక్కపడును.

రాయ—[విస్మయించుచు తనలో] అబ్బ! గండము తప్పినట్లే, మహామంత్రి ఉపాయము చేయగలడు. చాణక్య యౌగంధరాదులకు సమానుడు.
[నిష్క్ర]

అప్పాజీ.—ఎవరోయి అచ్చట. సుకక్షణమే అయ్యవరసు, కొండమరసు, అవసరం లక్ష్మీపతి మొదలైన నియోగులను రమ్మను. [అని వారువచ్చులోపల నేమో వ్రాయుచుండును.]

వారు [వచ్చి]—జయం జయం మహామంత్రిగారికి.

అప్పాజీ.—[వ్రాయుచునే] గందడి చేయకుడు. కూర్చుండుడు. [అని వ్రాతముగించి] అయ్యవరసు నీవీక్షణమే [illegible] పనిచేయవలసినది. మేము ఏకాంతముగా నున్నందున గజపతి రితెగ సుబుద్ధి మొదలైన నియోగులు ఎవరువచ్చినను రానీయకూడదు! ఎవరినిగాని మనపాళెమునుండి బైటవెడల నీయక, బయటివారిని లోనికి రానీయక ఎక్కడివారి నక్కడనే తెల్లవారువరకు నిలిపివేయవలసినది. ఆజ్ఞమీరినవారికి తలపోవును.

అయ్య.—మహామంత్రియాజ్ఞ. [అని నిష్క్ర]

అప్పాజీ.—కొండమరసు, నీవు తక్షణమే పోయి ఏలినవారి ఆభరణముల నన్నిటిని తేవలసినది. [కొండమరసు నిష్క్ర]

అప్పాజీ.—లక్ష్మీపతీ! నీవుపోయి ఈఆభరణము లుంచుటకు మేలైన పగులనాలుపెట్టెలు తేవలసినది. [లక్ష్మీపతి నిష్క్ర॥]

అప్పాజీ—రాయసం వీరమరసు, నీవు గొప్ప రహస్యకార్యమును నిర్వహింపవలెను. ఏమాత్రము మంత్రభంగమైనను మన ఎల్లర ప్రాణములును పోయినట్లే. ఈజాబునకు నీవు స్వయముగా పదునాలు నకళ్లువ్రాసి ఒక్కొక్క దానియందును ప్రత్యేకముగా పదునాలుగురు పాత్రుల నామధేయములను వ్రాసి తక్షణమే తెమ్ము. [అని తానంతకుముందు వ్రాసిన జాబిచ్చి] ఏదీ ఒకమాఱు చదువుము.

వీరమ—[చదువును]

స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయవిభాళ, అష్టదిగ్రాయమనోభయంకర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణ దేవరాయమహారాయులవారు బలభద్రపాత్రునికి వ్రాయించుట యేమనగా మీరు రేపు ఉదయము యుద్ధమునకని మిషపెట్టి మీగజపతివారిని మాకు పట్టియిచ్చుటకు ఒప్పుకొన్నందులకు చాల సంతోషమైనది. అందులకు బహుమతిగా మీ మీ రాజ్యములు మీకే స్థిరపరచుటయేగాక ఈనవరత్నాల కడియము, ఈవజ్రాల మొలత్రాడు మొదలైన యాభరణములు ఇరువదికోట్ల వరహాలు వెలగలిగినవిన్నీ ఈకామగరలును ప్రస్తుతము బహుమతిగా పంపుచున్నారము. మీరు గజపతిగారిని మాకు పట్టియిచ్చినవెంటనే ఒప్పుకొన్న ప్రకారము మీమీ ప్రభుత్వములు మీకేర్పాటు చేయించగలము.

మొహరు శ్రీకృష్ణదేవరాయులు.

అప్పాజీ.—సరి. పదునాలు జాబులు ఈపగులనాలుపెట్టెలలోనుంచి భూషణములు నిడుగిరలు దానిలో పెట్టించి పనువాద్దుడు బుద్ధిమంతులైన నియోగులవశమున నిచ్చి గజపతివారి శిబిరమునకు పంపవలయును. ఈపదు వాగ్గురును దొంగలవలె పట్టినయిది పాత్రులకు తెలియక గజపతివారికి పట్టు

పడవలయును. ఈరాజులును అధికారములును గజపతివారి చేత పడవలయును. తక్షణమే నీవు ఈసంవిధానమును చేయవలయును.

రాయసం వీర.—మహామంత్రిగారియాజ్ఞ. [అని నిష్క్రా.]

అప్పాజీ.—[ఆకసమువైపు చూచి] తెల్లవారుట కింకను చాలప్రొద్దున్నది. ఔరా! నాయీప్రయోగము చేత పాత్రులు, ఆయత్తపడి వచ్చులోపల తెల్లవారుటకుముందే గజపతి వింధ్యారణ్యము పాలిపోవును. పాత్రులు ఇతి కర్తవ్యతామూఢులగుదురు. ఇంతలో మనసైన్యములు కటకమును ఆక్రమింప గలవు. ఔరా నానీతిప్రయోగము ముందు ఇతరుల ప్రతిభ ఏపాటి?

[అని నిష్క్రా.]

---

## స్థలకము 4.

### గజపతి ఆస్థానము.

గజపతి చేత పదునాలుగురాజులతో ఆటోపమున
ప్రవేశించును, కూడ మంత్రియు.

గజపతి.—ఎంతద్రోహము! ఎంతద్రోహము! ఈపాత్రు లెంత ద్రోహమున కొడిగట్టినారు. ఈ యపాత్రులను నమ్మి యుద్ధమునకు పోనుంటిమి. ఈయందరును మమ్ము యుద్ధమునకని మిషపెట్టి కొనిపోయి చేపట్టుగా శత్రువులకు కట్టియిచ్చుటకు సంసిద్ధులైనారు.

మంత్రి.—మహాప్రభూ! తొందరపడవలదు. ఆపత్కాలమున ధైర్యము వహింపవలయును. మనవారే ద్రోహమున కొడిగట్టినారుగదా. ఆరాజులేమి! అవగలేమి, అపాత్రులేమి. ఏలినవారికి తెలియకయే వీరికి శత్రువులతో ఉత్తర ప్రత్యుత్తరములేమి. ఈరాజుల చేత వీరు కర్ణాటకమువారికి మనమంత్రాలోచన యంతయు తెలిపి వేసినట్లు తెలియుచున్నది. ఆజగన్నాయకుల కరుణచేత మనకు ముందుగా తెలిసిపోయినది.

గజపతి.—మరి మనము తడయంజనకు పోము తక్షణమే మాకు తోచినచోటికి పోగలము. వ్యవధిచాలదు. మంత్రీ నీవైనను మాకుటుంబమును కాపాడుము. అన్నివస్తువులును నీయధీనములు. బ్రతికియున్న సుఖము పడయవచ్చు. నమస్కారములు

మంత్రి.—హా! ఎంతకష్టమువచ్చినది. చింతించుటకైన నవకాశములేదుగదా. ఏలినవారు తడయంజనకు. మీకుటుంబమును నేను కాపాడెదను.

గజ.—మాఅన్నయుని జగన్మోహినిని రాయునిచేత పడనీయక ప్రాణప్రదముగా చూడవయ్యా; నీఋణము ఇంకొక జన్మమందైనను తీర్చుకొనెదను.

మంత్రి.—ఇదికూడ నాకు చెప్పవలయునా.

[ నేపథ్యమునుండి—మహాప్రభో గుఱ్ఱము సిద్ధముగా నున్నది.

గజ.—ఏదిరా మా గుఱ్ఱము. ఎక్కడరా. [అనివడిగా నిష్క్ర.]

మంత్రి.—హా! గజపతి యీవిధముగా తన రాజ్యమును కుటుంబమును త్యజించి పారిపోవునట్టి కాలము వచ్చినది. నేను పోయి వారి కుటుంబమును రహస్యప్రదేశమున దాచెదను. [అని నిష్క్ర.]

---

## స్థలకము 5.

### రాయల శిబిరము.

రాయలు, అప్పాజీ, కవులు నియోగులు మొదలైనవా రుందురు.

దూతలు ప్రవేశించి—దండం దండం మహాప్రభో! మనసేనానాయకులు యుద్ధప్రయత్నాన్ని వినినవారు ప్రతాపాన్ని విని గజపతిగారు కుటుంబం సూర్యోదయంలోపలనే వింధ్యారణ్యం పారిపోయినారు. వారికుటుంబం

కూడా కనబడలేదు. పదహారుగురు పాత్రులువచ్చి వారిని కానక దిగులుపడుతా వున్నారు.

[రాయలు అప్పాజీవైపు చూచును. అప్పాజీ చిఱునవ్వు నవ్వును.

మఱియొక వేగు.—జయం జయం ఏలినవారికి. పదహారుగురు పాత్రులు ఏలినవారి ప్రతాపంబని ఏలినవారికి పాదాక్రాంతులైనారని తెలిసికొని తమకు రాజ్యం నిలువదని కలచి గజపతులవారున్నూ వారి అంతఃపురమున్ను రాత్రికి రాత్రియే బయలుదేరి ఎక్కడికో పరారియైనారు. మన దండనాయకులు రాజధానీనగరం ప్రవేశిస్తున్నారు. [సభ్యులు ఆశ్చర్యపడుదురు.

మరియొకడు ప్రవేశించి—మనసైన్యాలు కటకం ప్రవేశించి కోటను స్వాధీనం చేసుకొన్నవి. ఏలినవారు తక్షణమే విజయధ్యానంతో బయలుదేరి వచ్చి నగరు ప్రవేశించవలెనని మహాసేనాపతి పెమ్మసాని రామలింగము నాయుడుగారు మనవిచేస్తున్నారు.

[రాయలు అప్పాజీని చూచును. అప్పాజీ గంటవాయించును. వెంటనే నేపథ్యమున ధమామి మ్రోగును.

అప్పాజీ.—కొండమరుసుగారు, మీరు ఈవిషయము గజపతిగారి మంత్రికి నచ్చచెప్పి గజపతిగారిని పిలిపించుడు. మాయేలినవారు శ్రీకృష్ణరాయ మహారాయలవారు గజపతిగారికి ఎటువంటి ద్రోహమును ఎంచలేదు. వారి పాత్రులకూ లోపము లేదు. మాకు జయించిన ప్రతిష్ఠ చాలును. గజపతివారి రాజ్యమును గ్రామభూములను యథాపూర్వము గజపతివారికే స్వాధీనము చేసి విజయస్తంభము వేసి మరలిపోదలచినారు. గజపతులవారు ఏవిధమైన సంకోచము వహింపక మాతో సఖ్యము చేయవలసినది. గజపతిగారు మరలివచ్చునట్టి సంవిధానము చేయవలసినది, అని.

కొండ.—ఏలినవారి దయ [అని నిష్క్ర.]

అప్పాజీ.—మహాప్రభువులు పొట్నూరికడ విజయస్తంభము నాటించి కటకమునకు తరలుచున్నారు. అందరును సన్నాహము కావలసినది.

[అందరు నిష్క్రమింతురు.

---

## స్థలకము 6.

కటకము—గజపతి నగరు.

రాయలు, గజపతి, అప్పాజీ, మంత్రులు ప్రవేశింతురు.

వంది.—'జయాధిప దిగ్విజయాధిప' [ఇత్యాది పఠించును.]

గజపతి.—కృష్ణరాయ చక్రవర్తి, త్రిలోకరక్షకా,

ఉ. నీటున మొదుటీర్చుకొననేర, మదీయకుమారి, జాయశ్శ్రీం
గారమణిన్ గుణోన్నమణిని గ్రహియించుమి చ్చెదనీకు, గీరతు
ఘ్యారసమానరూప విజయనగరపబంధు యశోవికాసప
క్ష్మీరమణా ప్రతాప నరసింహకుమార కుమారవిక్రమా

రాయ.—

చ. వినుమునరేంద్ర సివనగ నేనన భేదము లేదు, నీమనం
బున నొకవింతగాఁ దలపబోకుము, శీఘ్రముగాగ నెంతయున్
ఘనతరవైభవం బలరగా నొనరింపు వివాహయత్నముల్;
*అనయ మిటాంధ్రదేశమున నైక్యతగల్గుత భారతంబులోన్.

సభ్యులు.—బళి బళి.

అప్పాజీ.—గజపతిమహారాయా! మేము సఖ్యమునకును దిగ్విజయము చేసిక ప్రతిష్ఠకొరకము వచ్చినవారమే గాని వేరుగాము. సర్వాంధ్రనక్షేత్రమొనరించి సంయుక్తాంధ్రరాష్ట్రసాధనమే మాముఖ్యోద్దేశము. మా

విజయనగరము మొదలు మీవిజయనగరమువరకు ఈదేశమంతయు సర్వకాల సర్వావస్థలయందును ఒకటిగానే యుండునుగాక. మనలో మనకు భేదము లేర్పడకుండునుగాక.

గజపతి.—మీయనురాగమునకు చాల కృతజ్ఞుడను. విజయనగరము నుండి కటకమువరకును గల యీయాంధ్రదేశమంతయు రాయలసీమయేగదా యైనది. ఈయాంధ్రసామ్రాజ్యము అవిచ్ఛిన్నముగా ఆచంద్రార్కము విలయుంగాక. ప్రభుత్వములు మారినను రాష్ట్రవిభజనయైనను మన యాంధ్రాభిమానము మారకుండునుగాక. మండలాభిమానముచే దేశాభిమానము చెడకుండును గాక.

వంది.—జయ జయ, కృష్ణదేవరాయ మహారాయ, సర్వాంధ్ర చక్రవర్తీ, సర్వాంధ్రరాష్ట్రప్రతిష్ఠాపక జయ.

అప్పాజీ.—గజపతిమహారాయ, మాయేలినవారు నేడే విజయనగరమునకు ప్రయాణము.

గజపతి.—సకలసన్నాహములకును ఏర్పాట్లు గావించెదను.

[అందరు నిష్క్రమింతురు.]

---

# పంచమాంకము

## స్థలకము 1.

### విజయనగరము.

ము. చేటి.—[ప్రవేశించి] నేడు తిమ్మనగారి పారిజాతాపహరణకృతి సమర్పణమహోత్సవం, దిగ్విజయమహోత్సవాంగంగా జరుగబోతున్నది. నేడుగదా చిన్నమదేవిగారి పలపంత తీరును. తిమ్మనగారు ఈవరకే తమ కావ్యమును పిలిచినవారికి కొంత వినిపించి వారిమనసు మెత్తబరిచియున్నారు. చూతాం గాక నేడేమి జరుగునో. అదుగో సభ జరుగుతున్నది. నేనుకూడ పోయి చాటుగచూచి అమ్మగారికి నివేదిస్తాను.

[అంత ఆసీనులై రాయలు, మంత్రులు, కవులు మొదలైనవారు ప్రవేశింతురు. తిమ్మనగారొక ప్రత్యేకమైన వేదికపైగూర్చుండి పారిజాతాపహరణములో గ్రంథాంతభాగములను చదువుదురు.]

కౌశికగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
        సూత్రుఁ, డార్వేలపవిత్రకులుఁడు,
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
        దనయుండు, సకలవిద్యావివేక
చతురుఁడు, మలయమారుతకవీంద్రునకు మే
        నల్లుండు, కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధ ఘనచతురంతయా
        నమహాగ్రహార సన్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురు శిష్యుండు పారిజాత

హారణమను కావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారా సుధాకరముగ.

రాయ.—[తనలో] మహాకవి మా యంతఃపురచరిత్రమును తనకావ్య మందు హెచ్చుగా ధ్వనింపజేసినాడు. మేము చేసినది సరికాదని మాకు నీతి యుపదేశించుచున్నాడు. వాస్తవమే. [ప్రకాశము] అప్పాజీ! ఈమహాకవులకు వారుకోరునట్టి అగ్రహారములు ఈయవలసినది. పంచమహావాద్యములును, చామరాందోళికాది సామంతచిహ్నములను మేము ఇచ్చినారము. తక్షణమే అల్లసాని పెద్దనగారికిని, నంది తిమ్మయ్యగారికిని పల్లకిలో ఊరేగింపు చేయవలసినది.

[నేపథ్యమునుండి—మహాప్రభూ, పల్లకివచ్చియున్నది.]

రాయ.—కవీశ్వరులారా, రండు. [అందరు నిష్క్రమింతురు.]

---

## స్థలము 2

చిన్నమదేవి నగరు.

ము. చేటి.—[ప్రవేశించి] అబ్బ! ఏమిగదా సుదినం. ఎన్నాళ్లకు మాదేవిగారికి మళ్లీ సంతోషం కలిగింది. తెనాలిరామలింగయ్య పెట్టిన కలహం ముక్కుతిమ్మనార్యుడి ముద్దుపలుకులచే తీరి మరల ఏలినవారు చిన్నాదేవిగారిని అనుగ్రహించినారు. తిరుమలమ్మగారికి మునుపు వజ్రపు జడబిళ్ల యిస్తే ఇప్పుడు దిగ్విజయమైన తర్వాత గోలకొండ గనులలో మంచినగ ఏలినవారు తెచ్చినారు. తిమ్మనగారికి అందోళికా ఛత్ర చామరాది సమ్మానాలు. ఎంత సంతోషం. అదుగో ఏలినవారు చిన్నమదేవిగారు ఇక్కడికే వస్తున్నారు. దేవిగారిని సర్వాభరణాలతోను అలంకరించి ఏలినవారు పిలుచుకొని వస్తున్నారు.

[అంతట చిన్నమదేవి ప్రవేశింతురు.]

చిన్న.—ఆవిధంగా ఏలినవారు కోటంతో వెళ్లిపోగానే నేను ప్రాణాల మీద ఆశవదులుకొన్నాను.

రాయ.—చెలీ! గతమునకు చింతిల్లకు. నీకు కావలసినదంతయు సిద్ధముగా నున్నదిగదా. ఒక వజ్రపుదిమ్మెకై కోపగించితివిగదా. గోలకొండ గనులన్నిటిని తెచ్చి యిక్కడ పెట్టించితిని. నవరత్నములు నీ నగరిలో రాసులు పోయించితినిగదా.

మం-పేటి.—ఇప్పుడుగదా నాకు సంతోషము.

[నేపథ్యమునుండి—మాకుమాత్రము సంతోషముగాదా.]

రాయ.—ఓహో రామలింగయగారు

రామలిం.—[ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. జయము జయము మహారాణిగారికి. ఏలినవారి దిగ్విజయంచేత రాణిగారు వర్ధిల్లుతున్నారు.

చిన్నమ.—రామలింగయగారి ఆశీర్వచనముచేత.

రాయ.—వాస్తవమే. వారు నాటిన బీజమే ఇట్లు ఫలించినది. మరి ప్రియా నీకింక నేమి కావలయును?

చిన్న.—ఏలినవారి యనుగ్రహము కలిగిన తర్వాత ఇంకను నే కావలసియుండును. అంతయు చేకూరినట్లే, కాని నాకొక కోరిక యున్నది ఏలినవారికి నామీద అనుగ్రహము కలుగగానే శ్రీతిరుపతి వేంకటేశ్వరులను దర్శించి స్వామికి మ్రొక్కులు ముడుపులు చెల్లించుకొని ఏలినవారితో కలిసి భక్తకోటిలో మన శిలావిగ్రహములు చెక్కింపవలయునని. ఈమ్రొక్కు చెల్లింపవలయునుగదా.

రాయ.—కాంస్యవిగ్రహము లేపోయించెదను. తక్షణమే సన్నాహము చేయించెదను.

రామలిం.—బళి, బళి! మహాప్రసాదము.

చిన్న.—[చేటితో] ఓసే మా అక్కగారినికూడా పిలిచిరావే.

[చేటి నిష్క్ర.]

రాయ.—ఎవరురా అచ్చట తక్షణమే మా అప్పాజీగారిని, మంత్రులను దండనాథులను, సామంతులను మేము చూడవలెను.

[తిరుమలదేవి ప్రవేశించును. రాయలు చిన్నాదేవియు సంభావింతురు. మంత్రులును ప్రవేశింతురు.]

రాయ.—మహామంత్రులారా మేము దిగ్విజయయాత్ర ముగించిన సంతోషమున భగవంతుని దర్శనార్థము తిరుమలకు పోదలచినారము.

సభ్యులు.—బళిబళి.

రాయ.—మేము కూడను మాకవులగోష్ఠిలో రచియించిన ఆముక్తమాల్యదా ప్రబంధమును అచ్చట దేవునికి అంకితము గావించెదము.

సభ్యులు.—మహాప్రసాదము, మహాప్రసాదము

రాయ.—మరి మన మెల్ల నిప్పుడే ప్రయాణము.

[అందరు నిష్క్రమింతురు.]

---

## స్థలము. 3

### తిరుమల భగవత్సన్నిధానము

[రాయలు, దేవేరులు ఒక ప్రక్కను, మరియొక ప్రక్క మంత్రులు, దండనాథులు, సామంతులు, కవీశ్వరులును నిలిచి సేవించుచుందురు. అర్చకుడు భగవత్ప్రసాద మొసంగి అందరమును శఠగోపముంచును. రాయలు ఆముక్తమాల్యదనుండి కొన్ని పద్యములు చదివి గ్రంథమును భగవత్పీఠమున నుంచును.]

శిల్పి.—మహాప్రభువులు దేవేరులతో నిటు ఎడముగా నిలువఁబడఁ శిలావిగ్రహముల రచనము ప్రారంభము చేయఁబడెను.

[రాయలు, దేవేరులును ఒకప్రక్క నిలుతురు.]

సభ్యులు.—జయ శ్రీకృష్ణదేవరాయ మహారాయా, సర్వాంధ్రచక్రవర్తీ, జయ. సర్వాంధ్రరాష్ట్రప్రతిష్ఠాపక జయ.

సమాప్తము.



చెన్నపురి : చంద్రికాప్రెస్సున ముద్రితము.—1946.
Q. H. M. S. 114 B. 500. 25-3-1946.